# రచయితల విన్నపము.

ఈ పుస్తకము వ్రాయుటకు చాలరోజులక్రిందట సంకల్పించి వ్రాసితిమి. ఆంధ్రరాష్ట్రనిర్మాణకార్యకర్తలసంఘ సాహిత్యశాఖవారిని అచ్చొత్తించమని కోరగా వారు దయతో అంగీకరించిరి. భూదాన వుద్యమముతో వుద్భవించిన సాహిత్యములోనుండి చాలవిషయములు సేకరించితిమి. అన్ని విధముల సహాయపడిన ఆ సాహిత్యానికి, రచయితలకు, అచ్చొత్తించిన ఆ. రా. ని. సాహిత్యశాఖవారికి, ప్రోత్సహించిన మిత్రులకు నమోవాకములు.

రచయితలు.

# వినోబా భూదాన వుద్యమము.



పూజ్య వినోబాజీ సంపూర్ణ జీవితచరిత్ర వ్రాయుట సులభ సాధ్యమైన విషయము కాదు. ఆత్మ పరిణామమే అధికంగాగల వినోబాజీ చరిత్రను వారే స్వయంగా వ్రాయుటలోనున్న సౌలభ్యము, విశేషత యితరులకు సాధ్యము కానివి.

మహారాష్ట్ర బ్రాహ్మణ కుటుంబములో 1895 సంవత్సరము సెప్టెంబరు 11వ తేదిన, కొలాబా జిల్లాలోనున్న "గగోడి" అనే చిన్న గ్రామంలో వినోబాజీ జన్మించిరి వారి మాతృశ్రీ, రుక్మిణీదేవి. ధార్మిక చింతనగల ఆదర్శగృహిణి. వీరి తండ్రి శ్రీ నరహర శంభూరావు భావే. వుత్తమమైన శీలము, చక్కటి వివక్షనాశక్తి, క్రమశిక్షణగల ఆదర్శవ్యక్తి. వీరు ఉద్యోగ రీత్యా బరోడా రాష్ట్రములో నుండుటచేత, వినోబాజీ తమ బాల్యములో అధిక కాలాన్ని తమ తాతగారి వద్ద గడిపిరి. తాతగారైన శంభూరావు భావేగారు నిశ్చల భక్తులవుటచే, వీరి ధార్మిక ప్రభావమే, తమ ధార్మిక చింతన కధికంగా దోహదమిచ్చిందని వినోబాజీ అంటూవుంటారు.

శ్రీనరహర శంభూరావు భావేగారి ఐదుగురు సంతానములో వినోబాజీ ప్రధములు. రెండవ వారైన శౌబాలో పూనా సమీపములోనున్న వుర్లీకాంచన్‌లో మహాత్మ గాంధీజీచే స్థాపింపబడిన ప్రకృతి చికిత్సా కేంద్రాన్ని నడిపించుచున్నారు. మూడవవారైన శ్రీశివాజీభావే వేదవిద్యా పారంగతులు వీరు వినోబాజీ రచనల పూర్తి బాధ్యత వహించి, పనిచేయుచున్నారు. నాల్గవ ఆమె, కొద్దికాలము వైవాహిక జీవితము గడిపి, చిన్న వయస్సులోనే మరణించెను. కంసారి పుత్రులు, "దత్తా," చిన్నతనంలోనే మృతిచెందిరి. వినోబాజీవలె వారి సోదరులు శ్రీ బాల్కోబా, శ్రీశివాజీ భావే కూడ అవివాహితులు. వీరు సేవా తత్పరులు, మరియు సర్వ సంగ పరిత్యాగ మొనర్చిన మహనీయులు.

గగోడేలో వినోబాజీ తన ప్రారంభవిద్యను ప్రకృతి మాత చెంతనే పొందెను. వీరు విస్తృతమైన గ్రంధ పఠనచేయువారు. కాని అర్ధంకానిది, ఆనందింపలేనిది, చదివి, కాలాన్ని వ్యర్ధపరచేవారు కాదు. వీరికి పత్రికా పఠనమందు ఆశక్తి మెండు. ఆరోజుల్లో, "కేసరి" అను పత్రికను తమ

మాత్మ్యకేవికి చదివి వినిపిస్తూ వుండెడివారు. వైరాగ్యం, ఆత్మాన్వేషణం, నిస్స్వార్థత తమతల్లి వద్దనుండే వీరు అలవరచుకొనినారు.

1905 సంవత్సరములో వినోబాజీ తండ్రి తమ కుటుంబమును, బరోడాకు పిలిపించుకొనిరి. వినోబాజీని ప్రాథమిక పాఠశాలలో చేర్పించిరి. స్వభావ సిద్ధముగా వీరు అధ్యాపకులుగాన, తమ పుత్రునకు ఆంగ్ల భాష, గణితము మొదలగునవి స్వయముగ బోధించుచుండెడివారు. 1910 సం॥ నుంచి వినోబాజీ వాస్తవిక విద్యాభ్యాసము ప్రారంభమయ్యెను. మహారాష్ట్ర ఋషులచే రచింపబడిన గ్రంథములయందు, జాతీయ, రాజకీయ సాహిత్యములయందున్నంత అభిరుచి వినోబాజీకి పాఠశాల విద్యాభ్యాసమునందుండెడిది కాదు. వీరు ముఖ్యంగా మంచి గణిత శాస్త్రజ్ఞులు. వీరికి గణితముపైనున్న అభిరుచియే, వారి జీవితాన్ని సక్రమమైన, నియమబద్ధమైన మార్గంలో నడిపించినది. తాము చేయదలంచిన దానిని పూర్తిగ మథించి, ఆలోచించి, నిర్ణయించుకొను స్వభావముగల వారవుటచేతనే, వారి జీవితములో వ్యర్థ కార్యములు తలబెట్టబడలేదు.

1913వ సం॥లో "మెట్రిక్" పరీక్ష పూర్తిచేసి, "యింటరుమీడియటు"లో చేరిరి. వారికి విద్య తృప్తినివ్వలేదు. వుత్తమ కార్యనిర్వహణకై, గృహపరిత్యాగము చేయవలెనని, ఎల్లప్పుడు చింతించుచుండెడివారు. 1916వ సం॥లో తమతల్లి వంటపనియందుండగా, ఆమె వద్దచేరి, తమపాఠశాల యోగ్యతా పత్రములను, తగులబెట్టిరి. తమ తల్లి యిదియేమి అని అడుగగా, తామిక పాఠశాల విద్యనభ్యసించ కాంక్షించుట లేదని, దానివలన లాభముండునని తమకుతోచుటలేదని తెల్పిరి

1916వ సం॥ "యింటర్ మీడియట్" పరీక్షార్థమై బొంబాయి వెళ్లుచూ, సూరతునుంచి బ్రహ్మవిద్యాన్వేషణకై బనారస్ చేరిరి. బనారసు అన్న సత్రమువారిచ్చు ఆర్థిక సహాయముతో సంస్కృతభాషాభ్యాసమును ప్రారంభించిరి. ఆదేసమయమున విశ్వవిద్యాలయ స్నాతకోత్సవము జరిగెను. ఆ సమయములో మహాత్మాగాంధీజీ యిచ్చిన, చరిత్రాత్మక ప్రవచనం వినోబాజీని ముగ్ధులనొనర్చి, వారి నవజీవితమునకు నాందిపల్కెను. ఇరువురి జీవితములు సన్నిహితమొంద మొదలిడెను. ఇరువురి మధ్య వుత్తర ప్రత్యుత్తరములు ప్రారంభమయ్యెను. స్వయంగా సంభాషించిన, సందేహములు నివృత్తి కాగలవని, "కోచారబ్ ఆశ్రమ"మునకు వచ్చి, వివరంగా

ముచ్చటించు మని మహాత్మాజీ వినోబాజీకి లేఖ వ్రాసిరి, వెంటనే వినోబాజీ బయలుదేరి 1916 సం॥ జూన్ 7 తేదీన గాంధీ మహాత్ముని కలిసిరి. వారి హృదయముల సామిప్రత, సంబంధము పెంపొందసాగెను.

వినోబాజీ నవ ఆశ్రమ జీవితము ప్రారంభమయ్యెను. సర్వం, పరమాత్మ స్వరూపమని, తాను శూన్యములోనే నుంటినని నిర్ణయముతో ఆశ్రమమును చేరిన వినోబాజీ, తనకర్తవ్యపాలన నిరాడంబరముగ శాంతి మార్గములో నిర్వహించెడివారు. సాయంసమయ చర్చలలో తప్ప, యితర సమయమంత ఏకాంతములో గడిపెడివారు. త్వరలోనే ఆశ్రమమంతా వారి వ్యుత్పత్తి ఆత్మను గుర్తించసాగెను.

వినోబాజీ తన యోగక్షేమములను తల్లిదండ్రులకు తెల్పియుండలేదనే విషయమును తెలిసికొని, వెంటనే గాంధీజీ, వినోబాజీ తమ వద్దనున్నారని, తామెన్నో సంవత్సరములవరకు సాధింపలేని ఆత్మ జ్ఞానమును, సంయమశక్తిని వినోబాజీ చిన్నవయస్సులోనే సాధింపగల్గినారని వ్రాసిరి. అనారోగ్య కారణంగా వినోబాజీ వత్సరం శలవుపై ఆశ్రమమును విడువ వలసివచ్చెను. సరిగా సంవత్సరము పూర్తికాగానే తమ గురువర్యులను చేరిరి. కొలబాజిల్లాలో వాయవ్యలోనున్న తమ స్వగృహమునకు వినోబాజీ వెళ్లిరి. మహాబలేశ్వర పర్వతముల దిగువను, కృష్ణానదీ తీరంలోనున్న మనోహరమైన, పవిత్ర ప్రదేశము "వాయ్" అచ్చట, సంస్కృత విద్వాంసులైన శ్రీనారాయణశాస్త్రి మరాఠా "ప్రాజ్ఞపాఠశాల" అనే సంస్థను నిర్వహించుచుండెడివారు. వినోబాజీ శంకరాచార్యులు బ్రహ్మసూత్ర భాష్యములపై జరుగుచున్న వుపన్యాసములను వినుచుండెడివారు. శంకరాచార్యుల గీతాభాష్యము వినోబాజీ నిరంతర సహచారి.

1918 సం॥ ఫిబ్రవరి 10వ తేదీన వినోబాజీ తాము యేవిధంగా యీ పన్నెండు మాసములు గడిపినది, గాంధీజీకి ఒకలేఖ వ్రాసిరి. వినోబాజీ అఖండశక్తి, యీలేఖవలన వెల్లడగుచుండెను. ఈసమయములో వినోబాజీ వుపనిషత్తులు. గీత మనుస్మృతి, పతంజలి యోగదర్శనం, న్యాయశాస్త్రము, వైశేషిక సూత్రము, యజ్ఞవల్క్యస్మృతి పఠించిరి. మరియొక ఆశ్చర్యకరమైన విషయము. వినోబాజీ కొందరు సహచరులను చేర్చుకొని, దినమునకు 6. 7 శేర్లపిండి విసరెడివారు. ప్రతి దినము 10, 15 మైళ్లు నడిచేడివారు. వారి భోజన ఖర్చు రోజుకు 0-2-9 అగుచుండెను. ఇంకను

తగ్గించుటకు తాము ప్రయత్నించుచున్నామని వ్రాసిరి. వారు యీ అనారోగ్యకాలంలో చేసిన యితర పనుల వివరములు.

(1) ఆరుగురు విద్యార్థులకు ఉచితముగా గీతను భోధించెడివారు.

(2) నల్గురు విద్యార్థులకు ఆరు అధ్యయములు జ్ఞానేశ్వరి నుండి భోదించిరి.

(3) ఇరువురు విద్యార్థులకు తొమ్మిది ఉపనిషత్తులను భోదించిరి.

(4) హిందీ నభ్యసించుచు, హిందీ వార్తా పత్రికలను చదివి విద్యార్థులకు వినిపించెడివారు.

(5) ఇరువురు విద్యార్థులకు ఆంగ్ల భాషను భోదించిరి.

(6) 400 మైళ్లు కాలినడకను సంచారముచేసి. చరిత్ర ప్రసిద్ధమైన రాజఘడ్. సింహఘడ్, తోరన్‌ఘడ్, కోటలను దర్శించిరి.

(7) సుమారు 50 గీతోపన్యాసముల నిచ్చిరి.

(8) "వాయ్"లో "విద్యార్థి మండలి"ని స్థాపించిరి. పఠన మందిరాన్ని యేర్పరచిరి. పిండి విసరి, దానితో లభించిన సొమ్ముతో దీనిని పోషించెడివారు.

సత్యాగ్రహాశ్రమవాసిగా యీ కాలంలో తమ ప్రవర్తన గురించి వ్రాయుచూ, "అస్వాదవ్రతం" "అపరిగ్రహం" అనే రెండు తామనుసరించుచున్నట్లు తెల్పిరి. తాము సత్యాహింసలను బ్రహ్మచర్యమును త్రికరణశుద్ధిగా ఆచరించుచున్నామని. సత్యాగ్రహము చేయవలసిన అవశ్యకత రయేర్పడిన, తెలియజేసిన తాముముందుగ రాగలమని వ్రాసిరి. వినోబాజీ లేఖకు జవాబు వ్రాయుచు, శిష్యుడు గురువుని మించిపోయినాడని, వినోబా వాస్తవంగా భీమ డేలని గాంధీజీ వుదహరించినారు. వారు తమ లేఖలో యింకా యిలా వ్రాసిరి.

"నీ ప్రేమ, సత్ప్రవర్తన నన్ను ముగ్ధుణ్ణిచేసినది. నీ ప్రవర్తనపై తీర్పు చెప్పగల సమర్థత నావద్ద లేదు. నన్ను నీపిత్రుసమానునిగా అంగీకరించితివి. సంతోషము. సత్యవ్రతుడైన తండ్రికి తననుమించిన పుత్రుడుండవలెను తండ్రి అడుగుజాడల్లో నడచువాడే పుత్రుడనబడగలడు. తండ్రిలో నుండే దయ, ప్రేమ, దృఢసంకల్పము కుమారునిలో అధికంగా నుండవలెను. నాప్రమేయం లేకుండా నీవు వానిని అలవరచ్చుకున్నావు. నీవు నన్ను నీ

తండ్రిగా స్వీకరించినందులకు, అస్థానాన్ని స్థిరపరచుకొనుటకు ప్రయత్నించెదను. నేను హిరణ్యకశిపు వయిన, నీవు ప్రహ్లాదుడివి కావలెను.

మరొక సమయంలో గాంధీజీ వినోబాజీని గురించి యిలా అన్నారు. "వినోబా గొప్ప వ్యక్తి. దాక్షిణాత్యులతోను, మహారాష్ట్రులతోను నాకుగల సంబంధం చాల వుత్కృష్టమైనది. వినోబా అందరిని మించిన వ్యక్తి."

వినోబాజీ ఆశ్రమమునకు తిరిగివచ్చిన కొద్దికాలంలోనే వారి తల్లి జబ్బుపడెను. బాబూజీ ఆజ్ఞప్రకారము, వినోబాజీ మాతృసేవకై వెళ్లెను. తల్లిదండ్రులు, సోదరుడుకూడ జబ్బుపడివుండిరి. తమ్ముడు మరణించిన మూడుదినములకు 1918 సం॥లో తల్లికూడ స్వర్గస్థురాలయ్యెను. కర్మకాండలలో తనకు విశ్వాసము లేక పోవుటచే, తల్లి అంత్యక్రియలలో పాల్గొనక, తనమాతృదేవి గదిలో కూర్చొని, గీతా, ఉపనిషత్తులు పఠించిరి.

తమ తల్లి జ్ఞాపక చిహ్నముగా ఆమెచీర, ఆమె పూజించు అన్నపూర్ణ విగ్రహాన్ని తీసుకొని, తిరిగి ఆశ్రమంచేరిరి. చీరెను తనతల క్రింద నుంచుకొని, నిదురపోయెవారు. ఖాదీ ప్రారంభముతో ఆచీరెను సబర్మతీ నదీప్రవాహమునకు సమర్పించిరి. అన్నపూర్ణ విగ్రహమును కాశిబెన్‌కు (కృష్ణదాస్ గాంధీ భార్య) బహూకరించిరి.

వినోబాజీ తమడైరీలో, తమ తల్లి మృతి చెందినప్పటికి, ఆమాతృ హృదయ స్పందనము ఎప్పటికి లోలోన అనుభవించుచున్నానని, ఆది అమరత్వానికి తార్కాణం అని వ్రాసుకొనిరి.

1921 సం॥లో గాంధీజీ అనుమతితో శ్రీ జమ్నాలాల్ బజాజ్ వినోబాను వార్ధాకు తీసుకొని వచ్చిరి. విద్యార్థి దశలో నున్న వారి శిష్యులు, శ్రీవల్లభస్వామి (ప్రస్తుతం సర్వసేవా సంఘ సహాయ కార్యదర్శి) సబర్మతికి వచ్చిన, వారి సహాధ్యాయులు, థోత్రేజీ, మోఘేజీ, గోపాలరావు కాలే దస్తాన్ కుందర్ దివాన్, వలంజ్ కర్ ఛీ, ప్రభాకరజీ, సత్యాన్ మొదలగువారుకూడ వార్ధాకు వచ్చిరి.

1921 సం॥ ఏప్రిల్ 8 తేదీన వినోబా వార్ధాచేరి, అందరిని చక్కటి శిక్షణలో నుంచి, మంచిపనిచేయించిరి. విధివిరామం లేకుండా, నిరంతరం పనిచేస్తూవుండేవారు. ఒక్క దేహంలో, దట్టమైన గడ్డముతో, వింతగా అగుపడుచుండెడివారు. 1921 సం॥ నుంచి 1947 సం॥ వరకు

వినోబాజీ ఆత్మ పరిశోధనాలయములో తీవ్రమైన ఆత్మ ప్రయోగములు, ఆశ్రమములో గ్రామ పరిశ్రమల పరిశోధన జరుగుచుండెడివి. వీని పరిణామముగా, వారి ఆత్మ పరిశోధనలు అత్యున్నతమైన ఆధ్యాత్మిక శిఖరములు చేరెను. గ్రామ పరిశ్రమల పరిశోధనా పరిణామంగా గాంధీజీ సూచించిన అష్టాదశసూత్ర నిర్మాణ కార్యక్రమములతో, నవచైతన్యముతో ఆశ్రమమంతా తొణికిసలాడుచుండెను. 1932 సం॥లో వర్ధాకు రెండు మైళ్ళ దూరములోనున్న "నల్వాడ్" గ్రామం చేరిరి. తమ జీవితం కేవలం నూలు వడకుటయందే ఆధారపరచి, ఖద్దరు పరిశ్రమలో గంభీర చింతన చేసిరి ఆనారోగ్య కారణంగా, పర్వత ప్రాంతములకు వెళ్లుట మంచిదని తెలుపబడెను. వార్ధాకు 5 మైళ్లదూరములో, "పౌనారు" నదీ వద్దనున్న, ఎత్తైన పర్వత ప్రాంతమునకెళ్ల, తమ అభిప్రాయమును తెలియజేసి. వినోబాజీ గాంధీగారి అనుమతితో అచ్చటకు వెళ్లిరి. దానికి "పరంధామ ఆశ్రమం," అని పేరిడిరి. అప్పటినుంచి యిదే వారి ప్రధాన కార్యాలయమాయ్యెను.

1923 సం॥లో జరిగిన నాగపూరు పతాక సత్యాగ్రహ వుద్యమములో, వినోబా పై ప్రథమముగా కారాగారమునకు వెళ్ళిరి. తమస్నేహితులతో ముచ్చటిస్తూ, కారాగార జీవితము నిట్లువర్ణించిరి. "సర్కసులో మనుష్యులు జంతువులను వశంలో నుంచుకొని, నడిపించెదరు. జైలులో దీనికి పూర్తిగ వ్యతిరేకము. ఇచ్చట జంతువులు, మనుష్యులను నడిపిస్తూవుంటారు. "నాగపూరు జైలు నుంచి, ఆకులా జైలుకి పంపబడిరి. పన్నెండు మాసముల జైలుజీవితానంతరము. 1923 సం॥ సెప్టంబరు 20 తేదీన విడుదల చేయబడిరి. వినోబాజీ అకోలా జైలుకి చేరక పూర్వము, అచ్చటి రాజకీయ ఖైదీలు, పనిచేయుటకు నిరాకరించుచుండిరి. వినోబాజీ వారికి నచ్చచెప్పుచు. శ్రమచేయక భుజించిట పాపమని, పరమేశ్వరుని ఆశీర్వచనమువలనే, తమకే శ్రమనిష్ట శిక్షణపొందే అవకాశము లభించినదని తెల్పినారు. వెంటనే ఎల్లరు దీనిని గుర్తించి, పనిచేయ ప్రారంభించిరి.

వార్ధా సమీపములోనున్న 300 గ్రామాలలో గ్రామసేవ కార్యక్రమములను ప్రారంభించిరి. 1948 సం॥ వరకు వినోభాజీకిందు సంబంధముండెడిది. ఈసమయములోనే, వినోబాజీ పొలంపని, నేతపని, పాకీపని మొదలగునవి అభ్యసించిరి. స్వాభావికముగనే వారువుపాధ్యాయులు

కూడా 1932 సం॥లో గాంధీజీ రెండవ టేబులు సమావేశము నుండి తిరిగివచ్చిరి. ప్రజల హింసాత్మక, వుద్రేక పూరిత కార్యములను గాంచి వినోబాజీ చాలబాధపడిరి. బహిరంగ సమావేశములో గావించిన వుపన్యాస ఫలితంగా, వారు తిరిగి ఖైదుచేయబడిరి. తమ ఆరు మాసముల జైలు జీవితమును "ధులాయి" జైలులో గడిపిరి. ఇచ్చట వారు తెల్పిన విషయములు గమనించిన, వారి నిరంహంకారము, నిరాడంబరము విశదపడగలవు. వారీ విధంగా అనిరి

"ప్రజలు సాధారణంగా రామాయణ పురుషులతో మాట్లాడుతూ వుంటారు ఆంగ్లేయ ప్రభుత్వమును రావణునితోను, మహాత్మాజీని శ్రీరామునితోను పోలుస్తూ, వల్లభాయిని హనుమంతునితోను, జవహర్లాల్‌ని అంగదునితోను పోలుస్తువుంటారు. నేనెవరితో పోల్చుకొనవలెనని ఆలోచించగా, రాయిగా మారిన అహల్య నాకు సరిఅయిన పోలికలని తెలిసినది. ఆవిధమైన రాయి కాగల్గిన, నేను చాల అదృష్టవంతుడనని తలంచుచుందును."

బాపూజీ, వినోబాజీల మధ్య జరిగిన కొన్ని వుత్తర ప్రత్యుత్తరములను గమనించిన, వారి హృదయములు, వారిసన్నిహితత్వం భోదపడగలవు. వినోబాజీ తాను నల్వాడలో నివశించదలంచిన సమయములో మహాత్మాజీకొక లేఖ వ్రాసియుండిరి. అందు వారీవిధముగ వ్రాసిరి. "వార్ధా ఆశ్రమం త్వరలోనే ద్వాదశవర్ష ప్రాయమగును. వుత్తమమైన అనుభవములు కల్గినవి. భగవంతుడే సత్యమనే విశ్వాసము దృఢమవుచున్నది. మీ ప్రోత్సాహము లేనియెడల నేనింతకాల మిచ్చట నివశించి వుండువాడను కాదు. ఈ ప్రపంచములో మీ ఆశీర్వచనము తప్ప, నేనేది ఆశించుటలేదు. ఈ ద్వాదశ వర్ష జీవితములో, నియమములను జాగ్రత్తగా పాటించుటకు నిరంతరము ప్రయత్నించితిని. అయినను కొన్ని లోటుపాట్లుండవచ్చును. కాని నాదీక్షా ర్హతకన్న అధికముగా పరమేశ్వరుని ఆశీర్వచనము నాకు లభించినది."

"మీ ఆశీర్వచన మెప్పుడు నాకు లభించుచున్నప్పటికి, ఆశీర్వదించమని తిరిగి కోరుచున్నాను. అల్పజ్ఞనకు మీరే రక్షణ యివ్వగలవని వున్నవి. మీ పవిత్ర కార్యములో నుపయోగపడు అర్హత భగవంతుడు నాకు ప్రసాదించవలెనని ప్రార్థించుచున్నాను. భవిష్యత్తుకేమైన సూచన

లివ్వదలంచిన. తెలుప ప్రార్థించుచున్నాను.”

ఇంత వుత్తమమైన విధేయతగల శిష్యుడే గురువునకు లభ్యపడి వుండడు. మహాత్మాజీ తమ హృదయమును విప్పి, తిరిగి జవాబువ్రాసిరి. “నీ ప్రేమ, విశ్వాసములకు పరమానంద భరితుడనగుచున్నాను. వానికి నేన ర్హుడ నవునో, కాదో. కాని అవి నీకు తప్పక అపారమైన మేలుచేకూర్చ గలవు. నీవు మహత్తర కార్యసాధనకై జన్మించినవ్యక్తివి.”

అపూర్వ గురు శిష్యులు!

1937 సం॥లో నల్వాడ నుండి వినోబాజీ పౌనారు చేరిరి. 1940 సం॥లో ప్రప్రథమముగా హిందూదేశ మొదటివ్యక్తిసత్యాగ్రహిగా, వినోబాజీ పేరు ప్రఖ్యాతిచెందెను. ఈమహత్తర కార్యసాధనకై వినోబాజీని మహాత్మాజీ ఎన్నుకొనిరి. మూడు మాసముల జైలు శిక్ష విధింపబడెను. పండిట్ జవహరలాల్ రెండవ సత్యాగ్రహిగా ఎన్నుకొన బడెను. విడుదలానంతరము వినోబాజీ తిరిగి సత్యాగ్రహము చేయుటచే, తిరిగి ఆరుమాసములు కారాగార శిక్ష అనుభవించిరి. మూడవసారి ఒక సంవత్సరం జైలు జీవితమును గడిపిరి. చారిత్రాత్మకమైన అగష్టు 1942, వుద్యమ సందర్భములో, వినోబాజీ 1942 అగష్టు 9 తేదీన ఖైదుచేయబడి, 1945 సం॥ జూలై 9 తేదీన విడుదలైరి. ఈసమయములో కొంత కాలము మద్రాసు రాష్ట్రములోని వెల్లూరుజైలులో గడిపిరి. అచ్చటనే, తమతోటి ఖైదీలవద్ద ఆంధ్ర కర్ణాటక, తమిళ, కేరళ, భాషనభ్యసించిరి. అచ్చట నుండి మధ్య ప్రదేశములోనున్న “సీయోని” జైలునకు పంపబడిరి. వార్ధాకు తిరిగి వచ్చునప్పుడు తమకుగల్గిన అనుభవ” ఫలితముగా ఆశ్రమం చేరగనే పౌనారుకు 4 మైళ్ల దూరములోనున్న “సర్గాన్” అను గ్రామములో పాకీపని ప్రారంభించిరి. కుంభ వర్షములోనైనను, అపరిమితవేడి, చలిలోనైనను నాల్గు మైళ్లునడచి, వెళ్లి, తమ కార్యాన్ని క్రమవిధానముతో నెరవేర్చెడి వారు. బాపూజీ మరణము వరకు వినోబాజీ యీపనిలోనే నిమగ్నులై వుండెడివారు. బాపూజీ మరణానంతరము దేశపరిస్థితులు వారి అత్యధిక శాధ్యతను గుర్తింపజేయుటచే తామప్పటి వరకు చేయుచున్న కార్యమును విడువవలసి వచ్చెను. 1948 సం॥ నుండి దేశపరిస్థితులను, ముఖ్యముగా కాందిశీకుల సమస్యను అవగాహన మొనర్చుకొనుటకు రైలులో దేశాటన ప్రారంభించిరి. దీనిని వారు “శాంతియాత్ర” అని అనెడివారు. కాని

దీనివలన వారి అంతర్వాణికి తృప్తిలభించలేదు పౌనారునకు తిరిగివెళ్లిరి. దీర్ఘచింతనానంతరము, శారీరక శ్రమతోకూడిన స్వయంపోషకత్వమును తమ అశ్రమములో ప్రవేశపెట్టిరి. పొలములో స్వయముగా రోజుకి 8, 10 గంటలు పనిచేసెడివారు. దానిని వారు "కాంచనముక్తి" అనెడివారు. ధన ప్రాబల్యమునుండి విడువబడి, సాంఘిక, ఆర్థిక, నైతిక, విజ్ఞాన శక్తులను సక్రమ మార్గములో సద్వినియోగ పరచుటయే దీని ప్రధాన వుద్దేశ్యము. ఈవిధమైన కార్యకలాపము 1953 సం|| ఏప్రెల్ వరకు కొనసాగింపబడినది. భూదాన యజ్ఞప్రారంభముతో యీ నిస్వార్థ సేవకుల దృష్టి సమాజ సమస్యను పరిష్కరించు వైపు మరలింపబడెను.

1930-31 సం||లో వినోబాజీ భగవద్గీతను సంస్కృత భాషనుండి మరాటీకి తర్జుమానొనర్చి, దానికి "గీతలు" (గీతామాత) అనిపేరిడిరి. వినోబాజీకి గీతకున్న సంబంధము వర్ణనాతీతము. తామెల్లప్పుడు గీతా సముద్రములో యీదులాడు చుందుమని, వాస్తవమునకు గీతతమ మాతృదేవి అని వినోబాజీ అంటూవుంటారు.

(గీతనామాతృదేవత, నేను ఆమె అమాయక పుత్రుణ్ణి. నాపొరపాట్లల్లో, దుఃఖాల్లో, ఆమెనన్ను తన ఒడిలోనికి లేవనెత్తును.)

1932 సం||లో "దులయే" జైలులో నున్నప్పుడు గీతపై, వినోబాజీ యిచ్చిన ప్రవచనము, "గీతా ప్రవచనము" అను అత్యద్భుత పుస్తక రాజముగా వెలువడెను. అది హిందీ, గుజరాతి, ఒరియా, సింధి, కన్నడం, తెలుగు, తమిళం. మలియాళం, ఉర్దు. బెంగాలీ, భాషలలోనికి తర్జుమా చేయబడెను. నవభారతములో యీగ్రంధమునకున్న విశిష్టత మరే గ్రంధమునకు లేదనవచ్చును. ఇదేగాక, వినోబాజీ అనేక పుస్తకగ్రంధములను రచించిరి. 1949 సం||లో "సర్వోదయ," అను హిందీ మాసపత్రికను ప్రారంభించిరి. మరియొక ముఖ్యమైన మాసపత్రిక. మరాటీలోనున్న "సేవక్" దీనికి వారి కార్యదర్శి, దామోదరదాసు ముంధాడ సంపాదకులు ఇది పౌనారు అశ్రమంలోనే, లోక నాగరి లిపిలో అచ్చు కాబడుచున్నది. దేవనాగరి లిపిలో వినోబాజీ చూపిన శాస్త్రీయమైన, నవీన అభివృద్ధి మార్గములిందు వుదహరించబడుచుండును. వినోబాజీ బహు భాషా ప్రవీణులు. వారి మాతృభాష అయిన, మరాటీ భాషతో సరిసమానముగా గుజరాతీ, హిందీ భాషలలో పాండిత్యముగలదు. ఉర్దు, బెంగాలి, ఒరియా,

పంజాబి భాషలలో చక్కటి జ్ఞానమున్నది. దక్షిణ హిందూదేశ నాల్గు భాషలైన తెలుగు, తమిళము, కన్నడము, మలియాళము, వారికి తెలియును. ఆంగ్లభాష విషయమై వేరుగ చెప్పనవసరములేదు. కాలేజీలో రెండవ భాషగా నభ్యసించిన ఫ్రెంచి భాష తెలియును. అన్నింటికన్న ముఖ్యమైనది వారి అత్యుత్తమ సంస్కృత పాండిత్యము. వేదములు, ఉపనిషత్తులు వారికి కరతలామలకములు. 46 సం||ల వయస్సునప్పుడు వారు అరేబియా భాష నభ్యసించుట. వారు నిత్య విద్యార్థులనే విషయమును వెల్లడి చేయుచున్నది. "కురాను"ను వారు చదువు విధానము ఆశ్చర్యము గొల్పుచుండును, ఇన్ని భాషలభ్యసించుటకు కారణము, వారు సర్వజనులతో, ఆచారములతో పరిచయమొంది, విశ్వమానవ సోదరత్వమును నెలగొల్ప వాంఛించుటయే. దీనివలన తమ ప్రేమ సిద్ధాంత ప్రచారము కొనసాగింపబడుట సులభ సాధ్యముకాగలదని వారిశ్వసించిరి. "జ్ఞానాభివృద్ధికయి, రెండు, మూడు, భాషాభ్యాసములు చాలును. అందరితో ప్రేమ సంబంధమును నెలగొల్పు కొనుటచే యిన్ని భాషలను నేను అధ్యయనం చేసితిని," అని వినోబాజీ అంటూవుంటారు. ప్రపంచములో ప్రతి అణువుయందు పరమేశ్వరుని దర్శించే దృష్టిని వినోబాజీ చరిత్ర తెల్పుచున్నది. మహాదేవదేశాయి వినోబాజీ గురించి యీవిధముగ వ్రాసిరి.

"ఇతరుల వద్దలేని ప్రత్యేక గుణము వినోబావద్ద గలదు. తమ నిర్ణయమును వెంటనే కార్య రూపములో నుంచుట, వారి ప్రత్యేకమైన విశిష్టగుణము. అవిచ్ఛిన్నమైన అభివృద్ధి వారి రెండవ విశేషగుణము. బాపూజీలో తప్ప, యీగుణము వినోబా ఒక్కరిలోనే నాకు కనబడినది".

సద్విచారము వినోబాజీ స్థిరమైన మిత్రరత్నము. వినోబాజీ వుత్తమ అభివృద్ధికి, వారి శారీరక, ఆత్మ పరిణామములు, దోహద మిచ్చినవి. వారి ఆశ్రమంలోని "కాంచనముక్తి" ప్రయోగము భారత దేశములో వాస్తవమైన స్వరాజ్యమును గ్రామగ్రామములో వ్యాపింపజేయుటకు మానవుని కోరికల నుండి విముక్తిని చేయుటకు అత్యధికముగ తోడ్పడినది. శారీరక శ్రమ నిష్ఠ, ప్రేమ అను ఆయుధములతో తమకలలను వాస్తవపరచ పొందలిడిరి. వీని ఆచరణ మార్గమనక్తి వొనర్చిన ఆత్మసాధనల ఫలితముగనే, భూదాన వుద్యమం వారికి స్ఫురించెను.

## 2

గాంధీజీ మరణానంతరము తమ కార్యక్రమ నిర్వహణమునకై నిర్మాణ కార్యకర్తలెల్లరు 1948 సం॥లో "సేవాగ్రాం"లో సమావేశమైరి. ఆ సమావేశములో వినోబాజీ సూచనానుసారము "సర్వోదయ సమాజం" స్థాపింపబడెను. వార్షిక సమావేశములు జరుపుకొనుటకు సర్వోదయ సిద్ధాంత వ్యాప్తికై సర్వవిధముల కృషి సల్పుటకు నిర్ణయించుకొనిరి.

ప్రథమ వార్షిక సమావేశము 1949 సం॥లో ఇండోరుకి సమీపములో నున్న "రాయ్"లో జరిగెను. ఆసమావేశములో వినోబాజీ సర్వోదయ సిద్ధాంతముల గురించి విపులీకరించిరి. సర్వోదయ సమాజ కార్యక్రమముల నిర్వహణకై "సర్వసేవా సంఘ" మను సంస్థను ప్రారంభించిరి. ద్వితీయ వార్షిక సమావేశము ఒరిస్సాలోని "అంగుల్" వద్ద జరిగెను. ఇందు వినోబాజీ పాల్గొనలేకపోయెను. తృతీయ వార్షిక సమావేశము హైద్రాబాదులోని "శివరాంపల్లి"లో 1951 సం॥ ఏప్రిల్ 8, 9, 10, 11 తేదీలలో జరుపుటకు నిర్ణయింపబడెను. దీని నిర్వహణకై "సర్వసేవా సంఘము" సేవాగ్రామములో సమావేశమయ్యెను. ఈ సమావేశములో వినోబాజీ శివరాంపల్లి సమావేశములో పాల్గొనుటకు తమ అయిష్టతను వెల్లడించిరి. కాని శ్రీ శంకరరావుదేవ్ మొదలగువారు ప్రారంభకులు, ప్రోత్సాహకులు అయిన వినోబాజీ పాల్గొన యిష్టపడక పోయిన, యీసమావేశములు అనవసరమని తెల్పుటచే, వినోబాజీ ఆఖరకు కాలినడకతో ప్రయాణముచేసి, శివరాంపల్లి సమావేశములో పాల్గొనుటకు అంగీకరించిరి. 1951 సం॥ మార్చి 8 తేదీన తమ ఆశ్రమము నుండి బయలుదేరి, 315 మైళ్లు ప్రయాణముచేసి, 1951 సం॥ ఏప్రిల్ 7 తేదీన వినోబాజీ శివరాంపల్లె చేరిరి. దినమునకు 10, 12 మైళ్లు నడచుచు, ఆయా గ్రామములు చేరగనే గ్రామమంతయు సంచరించి, వారి కష్టసుఖములను విచారించుచుండెడివారు. సాయంకాల ప్రార్థన సమావేశములో గ్రామ ప్రజలు పాల్గొనుచుండెడివారు. ప్రార్థనానంతరము వినోబాజీ గ్రామ రాజ్యము, సర్వోదయము గురించి వుపన్యసించుచుండెడివారు. కొద్దిదినములలోనే వినోబాజీ తమ రక్షకుడని ప్రజలు గుర్తింపసాగిరి. కార్యక్రమ నిర్వహణకై, ఒకవిశిష్ట వుద్దేశ్యముతో కాలినడకను ప్రజలను సమీపించిన ప్రథమవ్యక్తి వినోబాజీయే.

"శివరాంపల్లి"లో జరిగిన సర్వోదయ సమ్మేళనములో, వినోబాజీ పైననే ఎల్లరు ఆశలిడి, అంధకారములోనున్న దేశానికి మార్గం చూపగల వారు వినోబాజీయే అని విశ్వశించిరి. సమ్మేళనములో వినోబాజీ పంచ ప్రవచనములు వుత్తమోత్తమమైనవి. వారి ప్రథమ వుపన్యాసము సమ్మేళనమును ప్రారంభించుచు యిచ్చిరి. వినోబాజీ తమ ప్రారంభోపన్యాసములో కార్యకర్తలవలంభించవలసిన విధానములు వివరించిరి. శరీరశ్రమ నిష్ఠ నలవరచు కొనవలెనని, ధనమునుండి విముక్తులై తమతమ సంస్థలను నిర్వహించవలెనని కోరిరి. నిర్మాణకార్యకర్తలు స్వయముగా పొలములో శ్రమచేసి, శారీరకశ్రమ నిష్ఠకు ఆదర్శనీయులు కావలెనని కోరుచూ, చతుర్విధములైన కార్య క్రమములను శ్రోతలముందిడిరి.

(1) శాంతి సైన్యము కార్యకర్తలు గ్రామములలోకి వెళ్లి గ్రామస్థులు తమ సమస్యలను సర్వోదయ సిద్ధాంతరీత్యా పరిష్కరించుకొనుటకు బోధించవలెను.

(2) ప్రతి యింట రాట్నము, తకిలీ ప్రవేశ పెట్టవలెను. గాంధీజీ వర్ధంతి సమయమునకు ప్రతి ఒక్కరు స్వయంగా ఒడకిన ఒక చిలుప యిచ్చే ప్రయత్నము చేయవలెను.

(3) పాకీవృత్తి నిర్మూలన, కార్యకర్తలు స్వయముగా యీ పని చేయుచు, ప్రజలకు తను దొడ్లెలను పరిశుభ్రముగా నుంచుకొనుటకు శిక్షణ నివ్వవలెను.

మిగిలిన మూడు వుపన్యాసములు సాయంకాలము ప్రార్థనానంతర మిచ్చిన ప్రవచనములు.

మొదటి ప్రవచనములో వాస్తవమైన ప్రార్థనావిధానాన్ని విపులీకరించిరి. సదాచారమువలె ప్రార్థనకూడ ఓకసాధారణ విషయమై పోయినదని అంటూ, ప్రార్థనలో అహంకారమును, నిర్మూలనచేసే స్వభావముగలదని, యిది సదాచారములో లేదని తెలిపిరి. మన ప్రార్థన భక్తిమార్గము నవలంభించలేదని, తెల్పిరి. పరమేశ్వరుని సాన్నిధ్యమున తమ హృదయములు విశ్రాంతి పొందుచుండవలెననే తమ అభిప్రాయమును వెల్లడించుచూ, తమ వుపన్యాసమును ముగించిరి.

రెండవరోజు ఆహార సమస్య గురించి వుపన్యసించిరి. ఈ సమస్య పరిష్కారమునకు త్రివిధములైన సూచనలిచ్చిరి.

(1) వ్యవసాయ కూలీలకు ధాన్యరూపములో కూలియివ్వబడవలెను.

(2) వ్యక్తికి 16 రజముల బట్ట అవసరమై వుండ, మిల్లులు 11 గజములకన్న అధికముగా వుత్పత్తిచేయలేవుగాన, ప్రభుత్వము ఖాదీ పరిశ్రమను స్వయముగా నిర్వహించవలెను.

మూడవ దినము ఆర్థిక సమానత గురించి మాట్లాడిరి. ప్రాచీన కాలము నుండి భారతదేశము తన విశిష్టగుణమైన "దయ"ను పెంపొందించుకొనుచున్నదని, మనకర్తవ్యము 'దయ' అని మన ఆశయం 'సమానత' అని, మనదేశ చరిత్ర మనకు నేర్పించినదని అన్నారు. వాస్తవమైన 'దయ' స్వచ్ఛమైన సమానతలోనే వుందని గ్రహించాలి. ఈసమానతను సర్వ సమానంగా పెంపొందించుటలో వివేకము, దూరదృష్టి అవసరమని, యిది ఒకేదినములో సమకూడే విషయం కాదని క్రమక్రమంగా దీనిని సాధించాలని తెల్పినారు. సూర్యనారాయణుని వుదహరించుచు, వారివలె కార్యకర్తలు స్వయముగా వుత్తమోత్తమమైన అధర్మమును పాటించుచు, సమానత పీఠమునకు ఆత్మార్పణ మొనర్చినకాని సామాన్య ప్రజలకు నిజమైన సమానతచూపలేరని అన్నారు.

ఆఖరి దినము నిర్మాణకార్యకర్తలు రాజకీయములలో ఎంతవరకు పాల్గొనవచ్చుననే విషయముపై తీవ్రమైన చర్చలు జరిగెను, వినోబాజీ, తమ అభిప్రాయమును తామే పాటించుచు, యితరులపై దానిని బలవంతముగ రుద్దకుండుటకే పరమేశ్వరుని తాము ప్రార్థించుచున్నామని అన్నారు తనకర్తవ్యము ప్రజలకు భోదించువరకేనని, కార్యాచరణలోవారికి పూర్తి స్వాతంత్ర్యముకలదని తెల్పిరి. తామునూచించిన పంచసూత్రములను, అంతఃశుద్ధి, బహిశ్శుద్ధి, శాంతిసమర్పణం, శ్రమ, అనుమాటలలో యిమిడ్చిరి. త్రికరణశుద్ధిగా వీనిని ఆచరించవలెనని కార్యకర్తలను కోరిరి.

వార్ధాకు చేరుటకు పూర్వము కమ్యూనిష్టులు నడపిన వుద్యమప్రదేశం అంధకారములో మునిగి ప్రజలు అంశాతిలోనున్న తెలంగాణాలో పర్యటించుటను నిశ్చయించుకొనినట్లు వినోబాజీ తెల్పిరి. వారి హృదయాంతరళములోనున్నది, భవిష్యత్తు తెలియకపోయినపుటికి, అచ్చట చేరిన వారెల్లరు వినోబాజీ ముఖములో దివ్యతేజస్సును దర్శించగల్గిరి.

## 3

హిందూదేశములోని జనసామాన్యములోనున్న ఘోరమైన, విచార

నీయమైన హెచ్చుతగ్గులు. ముఖ్యముగా పేదవారు, ధనవంతులనే భేధము, భాగ్యవంతమైన హైదరాబాదురాష్ట్రములో అధికముగ వుంటూవుండేవి. ఇదిముఖ్యముగా తెలంగాణాలో అధికముగ నుండెడిది. శతాబ్దాలనుంచి స్థిరపడియున్న ఫ్యూడలు విధానము యీవిభేదములను మరింత పెంపొందించినది. హిందూదేశములోని యితర ప్రాంతములకన్న తెలంగాణా జనసామాన్యము అతి బీదస్థితిలో నుండెను. అయినప్పటికి, వారి దారిద్ర్యనివారణకు యేప్రయత్నము చేయబోలేదు. కొద్దిసంవత్సరములకు పూర్వమే కమ్యూనిస్టుయువకులను యీసమస్య ఆకర్షించెను. వీరు చాలా క్రూరంగా కన్ని సమయములలో హత్యలు కూడా చేయుచు, భూస్వాములను బాధింపసాగిరి. భారతదేశ స్వాతంత్ర్యానంతరము తెలంగాణాసమస్య మరింత వుధృతమయ్యెను. రాష్ట్ర, కేంద్రమంత్రివర్గములు పోలీసుచర్యలో నిమగ్నులైవుండుటచే, యీఅవకాశమును కమ్యూనిస్టులు తమ పార్టీ ప్రచారమునకు వుపయోగించుకొనిరి. వారి భయంకర కృత్యముల ఫలితంగా ధనవంతులు పరారీఅయిరి. అధికారులు వీరిని నిరోధించలేకపోయిరి. ఈవిపత్కాలములో కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు మేల్కొని, కమ్యూనిస్టుల జాడ తెలుపమని ప్రజలను వత్తిడి చేయసాగిరి. వీరికిభయపడి పేదప్రజలు కొందరు తెల్లడించసాగిరి. దీని ఫలితముగా కమ్యూనిస్టులు మరొకవైపునుండి వీరిని బాధింపసాగిరి ఆవిధముగా పగటివేళ పోలీసువారిచేతను, రాత్రి సమయమున కమ్యూనిస్టులచేతను పీడింపబడుచు, పేదప్రజలు కనివినిఎరుగని కష్టనష్టములకు గురికాసాగిరి. ఏమీఎరుగని అమాయక ప్రజలే దీనిలో అధికముగ హోమమయిపోసాగిరి.

ఈస్థితిలో వినోబాజీ, యీపీడిత ప్రజల రక్షణకై తెలంగాణాకు బయలుదేరిరి. బయలుదేరి వినోబాజీ, "శాంతి సైనికుడుగా, శాంతి ప్రచారమునకు తెలంగాణా వెళ్లుచున్నాను. చిరకాలమునుండి నాకీవాంఛ వున్నప్పటికి కారణాంతములచే ఫలించలేదు. నేడు శ్రీరాముని ఆశీర్వచనమైంది. నాయాత్ర ప్రారంభించుచున్నానని అన్నారు. తెలంగాణా సమస్యను వివరించుచు కొందరు వేల ఎకరాల భూమి కలిగియుండుట, మరికొందరికి ఒక్క ఎకరమైన లేకపోవుటయే యీఘోరకృత్యములకు కారణమని, వినోబాజీ అన్నారు ధనాపేక్షతో, పొగాకు, వేరుశనగ పండిస్తూ, గ్రామవృత్తులు క్షీణించుటయే తెలంగాణా సమస్యకు కారణమని

వినోబాజీ తెల్పిరి. సూర్యాపేటలో మాట్లాడుచు, వినోబాజీ, "కమ్యూనిష్టుల సృష్టికి ధనవంతులే కారకులు. వాస్తవమునకు ధనవంతులే కమ్యూనిష్టుల తండ్రులు," అనిఅన్నారు. ఈసమస్యా పరిష్కారమునకు దీనిమూలములను భేదించవలయును. ఆదిప్రభుత్వ చర్యలవలన కొనసాగింప బడజాలదు. కమ్యూనిష్టుచర్యలను నిర్మూలించవలన్న శాంతిమార్గములో భూసమస్యను పరిష్కరించవలెనని వినోబాజీ విశదపరచిరి. ఈశాంతిమార్గము వినోబాజీకి స్ఫురించిన విధానము వుత్కృష్టమైనది.

15వ తేదీ బయలుదేరి వినోబాజీ 18వ తేదీన పోచంపల్లి గ్రామము చేరిరి. కమ్యూనిష్టుల ముఖ్యకేంద్రమైన నలగొండ జిల్లాలో యీగ్రామము గలదు. దీనిజనాభా 3000 వుండెను. 700 గృహములుండెను. గ్రామములో సంచారముచేయుచూ, వినోబాజీ హరిజనవాటలోని ఒక గృహములో ప్రవేశించిరి. అందుఒక బాలింత పసిబిడ్డను చాపపై పరుండబెట్టి, తాను నేలపై కూర్చొని వుండెను. వినోబాజీ అమితమైన ఆప్యాయతతో ఆపసి బిడ్డను ఒడిలోనికి తీసికొనిరి. తమ పాదములను తాకిన అమాతృ దేవిని దీవించుచూ, వారు వెలుపలకు రాగా, గ్రామస్థులందరు కూడి తమ కష్టసుఖములను వివరించ ప్రారంభించిరి. వారి విచారనీయమైన చరిత్రను ఓపికతో విని, తమను మధ్యాహ్నముకలియుటకు వినోబాజీవారిని కోరిరి. మధ్యాహ్నం 1 గంటకు హరిజనులు, కొందరు సవర్ణులు వినోబాజీని కలిసిరి. వారితో సంభాషించుచూ, తమ సమస్య ఏవిధముగ పరిష్కరింప బడగలదని వారు తలంచుచున్నారని వినోబాజీ వారిని ప్రశ్నించిరి. వ్యవసాయముచేసి కొనుటకు తమకు భూమిపున్న తమసమస్యలను పరిష్కరించుకొనగలమని తెల్పిరి. ఎంతభూమి అవసరముండునని అడుగగా, ప్రజలు కొంత ఆలోచించి, 80 ఎకరముల భూమి చాలునని తెల్పిరి. వినోబాజీ దీర్ఘముగా ఆలోచించి, ప్రభుత్వమే భూమి యివ్వజాలనియెడల, భూస్వాములెవరైనా సహాయపడగలరా అని ప్రశ్నించిరి. కొద్దిసమయమంతా నిశ్శబ్దం. వెంటనే ఒకభూస్వామి తనభూమిలో 100 ఎకరములు దానమివ్వగలనని ప్రకటించిరి. వినోబాజీ వాని ముఖములోనికి చూచుచూ, తిరిగి చెప్పుమనిరి. ఆదాత తన వాగ్దానమును తిరిగి తెల్పుచూ, తనను విశ్వసించజాలకపోయిన, వ్రాతపూర్వకముగ నివ్వగలనని తెల్పిరి. వినోబాజీ ప్రత్యేకముగ దాతతో సంభాషించి, ప్రార్థన సమావేశమునకందరు హాజరవ

వలెనని కోరిరి. ప్రార్థన సమావేశములో దాత అయిన శ్రీ వి. రామచంద్రారెడ్డిని అందరకు పరిచయమొనర్చిరి.

ఆరాత్రి వినోబాజీ దీర్ఘచింతనలో జాగరము చేసిరి. ఈఆశ్చర్యకరమైన సంఘటనకు పరమేశ్వరుడే కారణభూతుడని, తాను భగవంతుని సేవకుడననే గాఢమైన అనుభూతి గలెను. ఆవిధముగా ప్రథమ భూదానము శ్రీ వి. రామచంద్రారెడ్డిగారు 18 ఏప్రిల్ 1951 తేదీన సమర్పించిరి. రెండవదినము మరొకగ్రామము చేరి. శ్రీ రెడ్డి ఉదారతను తెల్పుచూ, ఆగ్రామ ప్రజలనుకోరగా, అచ్చటకూడా దానము లభించెను. ఆదేవిధముగా శాంతి, ప్రేమసిద్ధాంతములను ప్రచారము చేసుకొనుచు, నలగొండ, వరంగల్లు జిల్లాలు పర్యటించిరి. ప్రతిదినము దానము లభించుచునే వుండెను. స్వాతంత్ర్య భారతదేశపౌరులుగా ప్రజలకర్తవ్యాన్ని వివరించుచూ, వినోబాజీ వారిని ప్రభోదించుచుండెడివారు. వరంగల్లుజిల్లా "తళ్లికెల్ల"లో వుపన్యసించుచూ, వినోబాజీ యిలాఅన్నారు.

"పూర్వకాలంలో అరాచక సమయములలో మనపూర్వీకులు యజ్ఞములు చేయుచుండెడివారు. నేడుకూడా యజ్ఞము చేయదలంచి, యీభూదాన ప్రయోగమును ప్రారంభించితిని. ప్రజలను దానమిచ్చుటకు కోరితిని. ప్రజాభ్యుదయమునకై కొనసాగింప బడుచున్న యీయజ్ఞములో ప్రతిఒక్కరు పాల్గొనవలెనని మనవిచేయుచున్నాను. యజ్ఞములలో మన భాగము విచ్చేయునట్లే, భూమిగలవారు భూమిహీనులకు భూమి నివ్వాలి. సాధారణముగా ప్రజలు కలియుగములో దానమెవ్వరుయివ్వరని అంటూవుంటారు. కాని అడిగేవారన్న ప్రజలు తప్పక యివ్వగలరని నావిశ్వాసము. ఇప్పటివరకు నాకు 3,500 ఎకరముల భూదానము లభించినది."

ఆవిధముగా ప్రచారము చేసికొనుచు, వినోబాజీ శాంతిదేవతగా తెలంగాణాలో పర్యటించిరి. భూదాన వార్తలు ప్రజలను ఆశ్చర్యచకితుల నొనర్చినవి. ఏభూమికొరకైతే సోదరులే పరస్పరం తగవులాడు కొందురో, ఆభూమి ప్రేమతో, కోటిసోదరులైన దరిద్రనారాయణులకు దానమివ్వబడు చున్నది. తమ ప్రచారములో వినోబాజీ కమ్యూనిష్టు సోదరులను కొందరిని కలిసిరి. వారియందు, వారిసిద్ధాంతములయందు వినోబాజీకెన్నడు ద్వేష భావములేదు. "చందుపట్ల" అను గ్రామములో మాట్లాడుచూ,

"కమ్యూనిష్టులు నాసోదరులు. వారిలో కొందరు నామిత్రులుగలరు. కమ్యూనిష్టు కావడము నేరముకాదు. కమ్యూనిష్టులుఅన్న పేద ప్రజల సేవకులు." అనిఅన్నారు. కాని వారవలంభించే విధానములు హిందూదేశమున కనువగునవి కావని వినోబాజీ విశ్వసించిరి. "కాని కమ్యూనిష్టులు హింసా విధానంతోను, హత్యాకాండములతోను కార్యసాధనకు ప్రయత్నించుచున్నారు. ఈవక్రమార్గముఅవలననే వారిపనులు నిరుపయోగమవుచున్నవి. ప్రముఖ కమ్యూనిష్టుసోదరులైన" శ్రీ డి. వెంకటేశ్వరరావుగారు వుత్తరములు: వారు నన్ను కలసిన, వారిమార్గము సరిఅయినదికాదని నచ్చచెప్పగలను నలగొండ హైదాబాదు జైలులలోనున్న కమ్యూనిష్టుసోదరులను కలసి, సంభాషించితని. శాంతి మార్గమునను సరించుటయే వుత్తమ ప్రజాసేవ అని ప్రజలు గుర్తించుట అత్యావశరము," అని అన్నారు.

మరొక సమయములో వినోబాజీ వుపన్యసించుచూ, యీప్రజాప్రభుత్వములో ధనవంతులను హత్యచేయనగత్యములేదని, ఓటు అధికారముగల ప్రజలు, శ్రీమంతులను పిస్తోలుతో కాల్చనవసరములేదని, కమ్యూనిష్టులు స్వచ్ఛమైన శాంతిమార్గమునవలంభించిన వారికి తమ సహకారము లభించుటయేగాక వుత్తమ మానవులందరి సహకారము లభించగలదని తెల్పిరి. పైరాలో వుపన్యసించుచూ, కమ్యూనిష్టులు తమ హింసామార్గమును విడనాడిన, వారితో తామూపనిచేయుచు, కమ్యూనిజం వ్యాప్తికి కృషిచేయిగలమని తెల్పిరి. వినోబాజీ విధానము కేవలము ప్రేమ మార్గము పైననే ఆధారపడివున్నది. పరమేశ్వరునియందు పూర్తివిశ్వాసముంచి, వారి ఆశీర్వచనములతో ఏ అధికారములేకుండ, శాంతిదూతలై, ప్రేమసిద్ధాంతములతో ప్రజలనుచేరిన మహత్తర యుగపురుషులు, హృదయ పరివర్తనయందు, మానవునిలో అంతర్భూతమైవున్న సద్గుణములయందు గాఢమైన విశ్వాశముగల యోగిపుంగవులు ఈవుత్తమోత్తమ కార్యనిర్వహణ, సేవాదృష్టిని గోల్పోయిన కాంగ్రెసువారిచేగాని, అధికార తృష్ణలోనున్న సోషలిష్టుల వలనగాని జరుగజాలనిది. అందరిమేలును వాంఛించే సర్వోదయ సమాజము దీనిని నిర్వహించవలసివున్నది. భూదానముతో పాటు స్వయంపోషణ, గ్రామపరిశ్రమలనుగురించికూడ వినోబాజీ ప్రవచిస్తూవుండేవారులు. జనాభా వృద్ధి పొందుచుండుటచే, భూమిలభ్యమవుట కష్టసాధ్యమవుచున్నది. కావున భావులను, కాలువలను అధికముగా నిర్మించుకొనవలెను. రైతుకి

భూమున్నంతమాత్రమున జీవితము గడపుట సులభము కాజాలదు. తన గ్రామములో లభ్యమగు ముడి పదార్థములనుండి వస్తువులనుత్పత్తి చేసిననాడే రైతు జీవితము, గ్రామప్రజల జీవితము సుఖవంతము కాగలవు. గ్రామములు సిరి, సంపదలతో నిత్య ఆనంద సౌఖ్యములతో తులతూగగలవు.

వినోబాజీ తెలంగాణాయాత్ర 6 జూన్, 1951 సం॥తో పూర్తి అయ్యెను. ఈచారిత్రాత్మకమైన యాత్ర 51 దినములు జరిగెను. వినోబాజీ 151 గ్రామములను దర్శించిరి. సుమారు 200 గ్రామములు పర్యటించి, 12, 201 ఎకరముల భూదానము సంపాదించిరి. ఈభూమి పంపిణీకొరకై శ్రీకోదండ రామిరెడ్డి శ్రీమతి సంగము లక్ష్మీబాయమ్మ శ్రీ కేశవరావు గార్లతో కూడిన ఒక కమిటీని నిర్ణయించిరి. ఈయాత్రలో వినోబాజీ 500 గ్రామతగాదాలను పరిష్కరించిరి. దాదాపు 2లక్షలమందికి వుపన్యసించిరి. ఈసమయములో వినోబాజీ దినచర్య యీవిధముగ నుండెడిది. 4 గంటలకు పూర్వమే నిద్రమేల్కొనెడివారు. కొంతసమయము అధ్యయనమొనరించి ప్రాతఃకాల ప్రార్థనానంతరము 5 గం॥లకు నడక ప్రారంభించెడివారు. 12 మైళ్ళు నడచిన తరువాత, అచ్చటనున్న గ్రామములో మకాంచేసెడివారు. స్నానము, అల్పాహారానంతరము స్వల్పముగా విశ్రాంతిగైకొనెడివారు. తదుపరి రెండుగంటలు వార్తాపత్రికలను చూచుటలోను, వుత్తరప్రత్యుత్తరములలోను గడపెడివారు. ఆతరువాత ఒకగంట నూలు వడకెడివారు. 4 గం॥ లకు పరిచయములు (interviews) ప్రారంభమయ్యెడివి. 5 గం॥లకు ప్రార్థన. వుపన్యాసము తదుపరి కొంతసమయము గ్రామస్థులతో సంభాషించి, 9 గం॥ లకు శయనించెడివారు.

27 జూన్ 1951 తేదీన పౌనారులోని తమ ఆశ్రమాన్ని చేరిరి.

## V

చిరకాలమునుంచి ప్రపంచములో భిక్షాటన అనేవృత్తివున్నది. ఒకే స్థలములో స్థిరముగనుండియో లేక దేశాటనచేయుచునో ఉదరపోషణార్థము కొందరు భిక్షాటన చేయుచుండిరి. కొందరు దీనిని నాగరికమైన ఒక వృత్తిగా పరిగణిస్తూ వుంటారు. శారీరకనిర్మాణమునకు మరికొందరు దీని నవలంబిస్తూంటారు. ఇంకాకొందరు భిక్షుకులు విజ్ఞానవంతులైఅడుగకుండుట తమకు లభ్యమైన దానితో తృప్తిపడుతూ ఉంటారు. కాని ఎకరములనడిగే మానవుని ఎన్నడు ఎవరు దర్శించి వుండరు. స్వయంపోషకత్వాన్ని ప్రోచా

రము చేయు మానవత్వమునసే ఎవరు ఎన్నడు చూచివుండరు.

వినోబాజీ యాత్రలో అనేకమంది విద్యావంతులు వారిని వారివుద్యమాన్ని పరిహసించుచుండెడివారు. ఎవరిని విరోధులుగా తలంచలేని వినోబాజీ వీరి అపహాస్యములకు, విమర్శలకు. ప్రత్యుత్తరమే యిచ్చెడివారుకారు వారొక సందర్భములో తెల్పినట్లు వారికి ఫలానా కార్యము చేయవలెననెడి ఆశగాను, ఫలానా కార్యము చేయరాదనే వ్యతిరేకతగానిలేదు. తమఅంతర్వాణి పిలుపునేవారు వినగలరు. దాని అనుసారముగానే కాలినడకను హైదరాబాదు వెళ్ళుట, అచ్చటనుండి తెలంగాణాకుపర్యటించుట జరిగెను. తెలంగాణాలో ప్రారంభమైన ఉద్యమము వినోబాజీలో ప్రజ్వలింపసాగెను. ఈసందర్భములో పంచవర్ష ప్రణాళికా రచనా సందర్భముగా శ్రీ ఆర్. కె. పాటిల్ వినోబాజీ అభిప్రాయములు గైకొనుటకై వినోబాజీని ఆహ్వానించిరి. వెంటనే వినోబాజీలోని అగ్నిబయల్వెడలెను. ఉద్రిక్తులై మిక్కిలి విచారముతో ఈవిధముగ వ్రాసెను "రాజ్యాంగములో ప్రతిఒక్కరికి తిండి, పనివాగ్దానముజేసి వున్నారు. దానిని పూర్తిగా విస్మరించితిరి. ఎవరి భుజస్కందములపై ఈభాద్యత మోపబడినదో వారు ఈ కార్యాన్ని నిర్వహింపజాలని యెడల రాజీనామా ఇవ్వండి. మీరుకుటుంబ ప్రణాళికను సూచించినారు. దీని పరిష్కారము సంతాననిరోధకము కాదు జీవితాన్ని సక్రమ మార్గములో నడిపించుట.

గ్రామ పరిశ్రమలను నాశనముజేసి యిప్పుడు వాని సహాయము కోరుచున్నారు. అప్రతికూల దినములలోనే గాంధీజీ అంతపనిచేయకల్గిన అంతకన్న అత్యధికముగా యిప్పుడెందుకు చేయగలమని తలంచలేదు? 1951సం॥ నకు ఆహారస్వయం సమృద్ధికి వాగ్దానము చేసిరి. దానిని నెరవేర్చలేక ఆహారస్వయం సమృద్ధి అసంభవమనే ప్లానింగ్ కమీషనును పిలచినారు. యుద్ధమొచ్చిన దేశస్థితి ఎట్లుండునో వూహించినారా? మీప్రణాళిక నిరంతర భిక్షాటన ఇదిఎవరిని అధికోత్పత్తి చేయుటకు ప్రోత్సహించ జాలదు."

ఖాదీ విషయములోను. గ్రామ పరిశ్రమల విషయములలోను, ప్రభుత్వము చూపుచున్న నిర్లక్ష్యభావమునకు వినోబాజీ అశ్రువులు రాల్చిరి. "2 సం॥లలో ప్రజలెల్లరు ఖాదీధరించేటట్లు నేను చేయగలను. అవిధముగా చేయలేకపోయిన మీరునన్ను వురితీయవచ్చును, కాని మీరే ఖాదీని యిష్టపడక పోవుట అనునవి వేరువిషయము.", అనిదుఃఖపూరితులై వినోబాజీ

అన్నారు. ప్రభుత్వ ప్రణాళికనైతే విమర్శించితిమి గాని దానికి నిర్మాణా త్మకమైన సూచనలు ఇవ్వలేక పోయితిమేయని ఆరాత్రంతా చాలాచింతిం చిరి. నిర్మాణ కార్యకర్తల సంఘములను సమావేశపరచి చుట్టుప్రక్కల గ్రామాలలో తమ ఆశయసిద్ధికి కృషిసల్పమని కోరగా వారువెంటనే పని ప్రారంభించిరి. వినోభాజీ తీవ్రమైన వాస్తవమైన విమర్శ నెహ్రూజీని చేరినది. వినోభాజీతో విషయములు చర్చించుటకై ఢిల్లీ విచ్చేయుటకు నెహ్రూజీగారిని కోరిరి. కాలినడకను ఢిల్లీచేరుటకు 12 సెప్టెంబరు 1951 తేదీన వినోభాజీ పవునారునుండి బయలుదేరిరి. 11 సెప్టెంబరు పవునారు లో వుపన్యసించుచూ తాము ప్రారంభించినది భూదాన యజ్ఞమని, అది కేవలము భూదానమునకు సంబందించినదే కాదని ఆయజ్ఞములో అందురు సహకరించవచ్చునవి తెల్పినారు. ఈయజ్ఞ ముఖ్యోద్దేశమును గుర్తించగల్గిన ధనవంతులు పేదవారిని గౌరవించి దానమివ్వగలరని ఈవుద్యమము ఫలిం చిననాడు సమాజములో అహింసాత్మక విప్లవము రాగలదని అన్నారు. ఆక్షణమువనే 75 ఎకరముల భూదానము లభించినది.

దినమునకు 12, 16 మైళ్ళు కాలినడకను ప్రయాణముచేయుచు, వినోభాజీ శ్రీ జె. సి. కుమారప్పగారి పన్నై ఆశ్రమములో మొదటిమకాం జేసిరి. నాగపూరులో వుపన్యశించుచూ పరమేశ్వరుడు తమకు శక్తినిచ్చి నంతకాలము దేశాటనచేస్తూ భూమిహీనులకు భూమిసంపాదించి యివ్వ గలమని తెల్పిరి. నాగపూరులో నిర్మాణ కార్యకర్తల సమావేశములో ఉపన్యసించుచూ అహింసాత్మక విప్లవముద్వారా సమాజ వ్యవస్థనుమార్చే వాతావరణాన్ని సృష్టించాలని యిదినా పేదరికపు సమస్య పరిష్కరింప బడజాలదని అన్నారు. గాలి, నీటిమీద అందరికీ సమానహక్కువున్నట్లే భూమిమీదగూడ అందరికీ సమానహక్కు గలదు. జనశక్తిని పెంపొందిం చుటను, ప్రజాశక్తిద్వారానే ఈసమస్యను పరిష్కరించుకోనవలెనని కోరిరి. ప్రభుత్వ సహాకారములేకుండ ఈసమస్య పరిష్కరించ బడగలదాయని ప్రశ్నించగా వినోభాజీ ప్రజారాజ్యములో ప్రభుత్వమన్న ప్రజాభిప్రాయ మేనని, ప్రజలకోరికను ప్రభుత్వము తప్పనిసరిగా నెరవేర్చవలెననిఅన్నారు. 11వ. సెప్టెంబరునుండి 17వ. సెప్టెంబరువరకు 111 మై॥ ప్రయాణముచేసి సగటున దినమునకు 300 ఎకరముల చొ॥న 2000 ఎకరములు సంపాదించిరి. ఈసగటున తెలంగాణాలోని 200 ఎ॥ సగటును పోల్చినదీని అభివృద్ధి వికా

దమువగలదు. ధనవంతులను, పేదవారిని అందరిని దానమివ్వమని కోరెడి వారు. పేదవారే అధికముగా వీరిభావాన్ని గుర్తించగలిగిరి. సెప్టెంబరు 18వ నుండి 27 వరకు 2311.49 ఎ॥ భూమి 201 ధాతలనుండి లభించినది.

గ్రామములలోను, అంతేగాక పేదవారి వద్దనుండి అధికముగా భూదానము లభించినదని తెలియుచున్నది. పేదవారి నైతికశక్తి ప్రేరణ వలననే ధనవంతులుకూడ క్రమక్రమంగా దానమివ్వ ప్రారంభించిరి. ఈ రోజు ఇవ్వనివారు రేపైనా యివ్వవలసి వుండునని హిందూదేశములో దాన మివ్వమని ఎవ్వరూ నిరాకరింపజాలరని వినోబాజీ అన్నారు. 2వ అక్టోబరు 1951 వ తేదీన సాగరుచేరిరి. ఆరాష్ట్రనిర్మాణ కార్యకర్తలెల్లరు సమావేశమైనారు. ఆసమావేశములో వుపన్యసించుచు తమ వుద్యమము సేవా తత్పరతతోను, ఆత్మార్పణముతోను కూడివున్నదని ఇదిసర్వ ప్రజలకు సంభందించినదని కార్యకర్తలు త్రికరణశుద్ధిగా పనిచేయవలెనని కోరిరి. ఈసమావేశములో తమ పంచవర్ష ప్రణాళికయైన 50000000 ఎ॥ భూమి 1957 వ సం॥నకు సంపాదించవలెనని బహిర్గతపరిచిరి. "నాపొట్ట చిన్నదైన ప్పటికి దరిద్రనారాయణపొట్ట చాలాపెద్దది. కాన నాకు 5కోట్ల ఎకరముల వ్యవసాయభూమి కావలెను కుటుంబములో ఐదుగురు కుమారులున్న నన్ను 6 వ వానిగాను నల్గురున్న ఐదవవానిగాను, అంగీకరించి, దేశములోని వ్యవసాయభూమిలో 5.వ భాగముగాని, 6.వ భాగముగాని దానమివ్వ కోరుచున్నాను. ప్రతిఒక్కరు ఈవుద్యమములో భాగము పంచుకొని, దరిద్రనారాయణుని పూజించండి." ప్రస్తుత భయంకరసమాజస్థితిని వివరించుచు నేటి ఆర్థిక జీవితవిధానమే మోసాలకు ద్రోహాలకు కారణమని దీనినిమార్చ్చ గలిగిన యావత్తు ప్రపంచానికి హిందూదేశ ప్రజలు ఆదర్శమూర్తులు కాగల రని అన్నారు. 7.వ అక్టోబరుతో వినోబాజీ మధ్యప్రదేశయాత్ర పూర్తి యయ్యెను. 563 ధాతలనుండి 6700 ఎ॥ భూదానము లభించెను. వీరిలో 541 నుండి దాతలు 25 ఎ॥ కన్న తక్కువ భూమికలవారు. 9 గురు 25,50 ఎకరముల మధ్యను, 13 100 ఎ॥ కన్న అధికము కలవారు.

3 దినములు ఉత్తర ప్రదేశమున పర్యటించి 11 వ అక్టోబరు వింధ్య ప్రదేశమున వినోబాజీ ప్రవేశించిరి. ప్రఖ్యాత హిందీకవి శ్రీ బనారాసీదాసు" చతుర్వేది వినోబాజీతో 5 దినములుండిరి. ఈప్రాంత ప్రజలు వినోబాజీ దర్శనమువలన అమితానందమొందిరి. మహాత్మాజీ వారిజీవిత కాలములో

ఈప్రదేశములో దర్శించలేక పోయిరి. అయినను. వారిమనసు కృతజ్ఞులైన వినోబాజీవారి మధ్య కొద్ది కాలముండుట వారిలోని ఆనందోత్సాహములలో వుర్రూతలూగించిరి. తిరిగి 16 అక్టోబరున వినోబాజీ వుత్తరప్రదేశములో ప్రవేశించిరి. 17_వ అక్టోబరులో ఝాన్సీలో వుపన్యసించుచు, వీరవనితయైన ఝాన్సీవలె వుదారతత్వమే కాక, వీరులవలే దానమివ్వవలెనని కోరిరి. విద్యార్థుల సభలో వుపన్యసించుచు రాజకీయ కార్యాలలో పాల్గొనుచున్నప్పటికి, విద్యార్థులు ఏరాజకీయ పక్షమునకు చెందివుండరాదని తెల్పినారు. "మీరందరు సింహములవలె నుండవలెను. గొర్రెలమందలు కారాదు. గుంపులు గుంపులుగాను, సంఘములు గాను వుండేపని గొర్రెలది. ఈరోజు ప్రతిఒక్కరు తమ అభిప్రాయములను విద్యార్థులపై రుద్దజూచుచున్నారు. ఈఅక్రమములనుండి రక్షించుకొనమని మిమ్ములను హెచ్చరించుచున్నాను." మధ్యభారతములోని, గ్యాలియర్ లో వుపన్యసించుచు, తాము భిక్షునడుగుటకు రాలేదని, స్వామిత్వాన్ని త్యజించుట అనేపాఠమును నేర్పుటకు వచ్చితిమని, "ఇది నాది, దీనికి నేను యజమాని" అని యనుట తప్పాయని తెల్పినారు యాజమాన్యము నిర్మూలింపబడిననాడే రామరాజ్యస్థాపన జరుగగలదని అదే సర్వోదయమని తాము కోరెడి మానసిక పరివర్తనఅనే ప్రవచించినారు. జాగీరుదారుల సమావేశములో వుపన్యసించుచు వేదములలో భూమి మాతృదేవి యని చెప్పబడివున్నదని తమ మాతృశ్రీపై యాజమాన్యాధికారాన్ని పొందుట పాపమని తాను పేదవారికి, జాగీరుదారులకుగూడ మిత్రులమని తెల్పిరి. ఈమాటలలోనే సత్యాన్ని గ్రహించి జాగీరుదారులు రాజపుత్రులైన తమధర్మము దానమిచ్చుటయేయని అది తామీరోజు గుర్తించగలుగుచున్నామని భూదానయజ్ఞములో పాల్గొనుటకు తప్పక తామాలోచించి, నిర్ణయించుకొనగలమని వాగ్దానము చేసిరి. 13 వ. నవంబరు 1951 వ తేదీన ఢిల్లీచేరిరి. ఈ 62 దినముల ప్రయాణములో 19436 ఎ॥ల భూమిలభించినది. ఈసమయములో తెలంగాణాలో మరి మూడువేల ఎకరముల భూమి సేకరింపబడెను. హిందూదేశముఖ్యపట్టణము చేరునప్పటికి మొత్తము 35000 ఎ॥ల భూమి సేకరింపబడెను. ఢిల్లీ చేరగనే ఢిల్లీ ప్రజల నుద్దేశించి, జాతిపితయైన బాపూజీసమాధిగల ఈప్రదేశ మతి పవిత్రమైనదని, వుదారహృదయులగు ప్రజలు విరివిగా దానమివ్వవలెనని ఇది తమ కర్తవ్యమని ప్రజలు గుర్తించాలని కోరిరి.

# VI

792 మైళ్ళు ప్రయాణముచేసి 13 వ. నవంబరు 1951 వ. తేదీన భారతదేశ భాగ్యవిధాత వినోబాజీ భారతదేశ ప్రధానియైన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూని బాపూజీ సమాదివద్ద జమునానది ఒడ్డున కలసిరి. వినోబాజీ రాజబాటలో చిన్నపూరిగుడిసెలో 11 దినములు నివసించిరి. ఆపేకాదశి దినములలో వినోబాజీని అన్నివర్గములవారు, పేదవారు గొప్పవారు, వున్నతాధికారులు, అనామతులు, నాయకులు సామాన్యప్రజలు, అనేకమంది కలసి అనేక విషయముల గురించి చర్చించిరి. ప్రధానమంత్రి, రాష్ట్రపతిగూడ వినోబాజీని ఈచిన్నగుడిసెలో కలియుట పూర్వకాలములో కలియుట పూర్వకాలములో అధిక బలవంతులుగూడ పకీరులను ఫకీరుల సలహా నాశ్రయించుచు వారి సహాయమును అపేక్షించిన విధముగ వుండెను. ఈవిచిత్ర సంఘటన విదేశీయుల సహితము ఆశ్చర్యచకితుల నొనర్చినది. బాపూజీ సమాధివద్ద బస చేయుట వినోబాజీకి ఒకవిధమైన వుత్తమప్రేరణ కల్గించినది. వినోబాజీ బాపూజీ ఆత్మ తమనెప్పుడు వెంటాడు చుండునని, తాముపొరబాట్లు, చేసిన వెంటనే బాపూజీవానిని సరిచేయు చుండునని అన్నారు. వినోబాజీ ఢిల్లీ ప్రజలకు తనను వామనునిరూపములో పరిచయము చేసికొనిరి. వామనునివలె తాము మూడు అడుగులు దానము కోరు చున్నామని అంటూ, మొదటి అడుగు దానమిచ్చుట, రెండవ అడుగు యితరులసేవలో మగ్నమగుట, మూడవది తమదంతా త్యాగమొనర్చి నిరాడంబర సేవకులై, తమను తాము సమాజసేవ కర్పిత మొనర్చుకొనుట అని విశదపరచిరి. భూదానము త్యాగస్ఫూర్తి కల్గించుటనేయని, ప్రతిఒక్కరు దరిద్ర నారాయణునకు సేవచేయాలని ఆశించవలెనని అన్నారు. ధనాన్ని వినోబాజీ సేకరించరు. ప్రతివర్తకుడిచ్చిన 1000 రూ॥ ధనాన్ని నిరాకరించుచు వినోబాజీ తాము ధనంతో సంబంధము లేకుండా, ధనమునుండి వుత్పత్తి అయ్యే సమస్యలనుండి ముక్తులై కార్యము సాధించాలని వాంఛించుచున్నామని తెల్పిరి. ధనమే దేశాన్ని నేడు హీనస్థితికి తెచ్చిదని, ధనము మానవుని సోమరిగాను, అసత్యవాదిగాను చేయుచున్నదని, దీనినుండి మన దైనిక జీవితమును విముక్తి చేయవలెనని కోరిరి.

ధనమురొక్క తుంటరి తనాన్ని వివరించుచు, "కృషికుని వుత్పత్తి ప్రతి సంవత్సరము ఒక్కేవిధముగా నున్నప్పటికి, ధరలుమాత్రము భేదమొందు

చుండును. ధరలు వుత్పత్తినిబట్టి గాక, సొమ్మునుబట్టి నిర్ణయింపబడుచున్నవి. ధరవిలువలలోనే హెచ్చుతగ్గులు భేధములున్నవి. ధనమంత అపనమ్మకముగ, అనిశ్చితముగనున్న, దీనిఆధారముతో వ్యాపారమెందుకు జరుగవలెను? దీనికి జవాబు నాకేల స్ఫురించుటలేదు? అర్థిక శాస్త్రవేత్తలను దీనిని తెలిసికొనుటకు కోరితివి. కాని వారికిగూడ సాధ్యము కాలేదు.'' దీనిఅర్థమువినోబాజీ జీవితములో ధనావశ్యకతను గుర్తించలేకపోవుటలేదు. ఒకసందర్భములో వారన్నట్లు, భగవంతునివలె సర్వవ్యాప్తమైన యీధనాన్ని జీవితంనుంచి తొలగించుట సులభసాధ్య మవునదికాదు. కాంచనముక్తులవుట అన్ని, స్వాతంత్ర్య జీవితములను గడుపుటఅని, ధనాపేక్షలననే ప్రజలనేకమైన వక్రమార్గములవలంభించుచున్నారని వినోబాజీ అన్నారు. వినోబాజీ వారి నాణెముల విధానమును వివరించుచు "నేనుధనమునకు వ్యతిరేకినికాదు. నాణెములకన్న కాగితములనే అధికంగా నేను బలపరచుదును. కాని నేను కోరే నాణెములు శ్రమరూపములోనుండును. విఅ నాసిక్‌లో అచ్చుచేయబడవు. అవి గ్రామస్థులతోనే వారి వుపయోగార్థము నిర్ణయించబడును. ఈ విధానములో పరపత్తి ప్రశ్నయే వుండదు'' తమ ప్రణాళికను వివరించుచు "నాప్రణాళిక వికేంద్రీకృత రాజ్య నిర్మాణమును స్థాపించగలదు. ఇది భగవంతుని సృష్టిలోనే వున్నది. ఆవిధముగా కోరియుండని యెడల భగవంతుడు తెలివినంతా ఢిల్లీలో ఏదో బ్యాంకులో పెట్టి వుండెడివాడు. ఆవిధానము ప్రయత్నించి, విఫలుడై వుండుటచేతనే, వికేంద్రీకృత విధానాన్ని అనుసరించి, పాలసముద్రములో పొందగల్గుచున్నాడు.'' అని వినోబాజీ వివరించినారు. గ్రామపరిశ్రమ క్షీణదశను గురించి మాట్లాడుచూ ప్రత్తిపండే స్థళములలో గ్రామములు బట్ట తయారు చేసి కొనగలవని, కాని ఖాదీఅన్న అర్థిక శాస్త్రకారులెల్లరు హెనకాడుచుందురని అన్నారు. "గ్రామములను ఖాదీవుత్పత్తిచేయనీయకపోవుట బూర్జువిధానమనబడగలదు ఈవిషయములో బూర్జావకాదులు, కమ్యూనిష్టులు ఏకీభవించుచున్నారు. ఇరువురకు వుత్పత్తి విధానములో ఒకేయభిప్రాయము గలదు. వుత్పత్తి పంపకములో వీరు బేధాభిప్రాయము గలిగివున్నారు. తెలిసియో, తెలియకయో బూర్జువావిధానము ఖాదీవిషయములో అనుసరింపబడుచున్నది.''

ఢిల్లీచేరిన తమపరి మూడుదినములు ప్లానింగు కమీషనువారితోను, నెహ్రూజీతోను, సంభాషించిరి. ఆహార వుత్పత్తిగురించి మాట్లాడుచు,

విదేశాలనుంచి దిగుమతులను నిలిపి, దేశంస్వయంపోషకమవుటకు, దృఢ నిశ్చయముతో, పట్టుదలతో కృషిసల్పాలని కోరిరి. ఈవిషయములో ప్లానింగు కమీషను పీఠితో ఏకీభవించక, కొంత కాలమువరకు ఆహారపదార్థముల దిగుమతి అవసరమని అన్నారు. నిరుద్యోగ సమస్యనుగురించి మాట్లాడుచూ, ప్రతివ్యక్తికి వెంటనే వృత్తిచూపుట ప్లానింగు కమీషను కర్తవ్యమని వినోబాజీఅనగా వారంగీకరించిరి. కాని ప్రస్తుత పరిస్థితులలో అది వెంటనే సాధ్యము కాజాలదని తెల్పిరి. వినోబాజీ తమవుద్దేశ్యములో ఈసమస్య పరిష్కారమగు వరకు ఏజాతీయ ప్రణాళికరచన జరుగజాలదని, దీనిని అంగీకరించిన నాడే గ్రామాలకు స్వయం సమృద్ధిచేయగలదని తమ అభిప్రాయమును వెల్లడించిరి. ప్లానింగ్ కమీషను, వినోబాజీ తమతమ అభిప్రాయాలలో ఏకీభవించలేక పోయిరి. ఇరువురి ఆశయము దేశాభివృద్ధియే అయినప్పటికి యిరువురి మార్గాలు ఏకము కాలేక పోయినవి. పదకొండు దినములు రాజధానిలోగడిపి, 24 నవంబరు 1951 తేదీన వినోబాజీ తమ పదయాత్ర తిరిగి వుత్తర ప్రదేశమునకు ప్రారంభించిరి.

## VII

భూదాన వుద్యమం కేవలం తెలంగాణాలోనే గాక, యితర ప్రాంతాలలోకూడ గుర్తింపబడుట, దీనిని సమయమే కోరుచున్నదనే విషయం విశదపరచుచున్నది. ఢిల్లీవిడచి, వినోబాజీ వుత్తర ప్రాంతమంతట పర్యటించుటకు నిర్ణయించుకొనిరి. ఈరాష్ట్రమునుంచి కోటి ఎకరముల భూమిని కోరిరి. దీనిలోనుంచి మొదటి కోటాగా, 5 లక్షల ఎకరముల భూమిని ఒక సంవత్సరములో సంపాదించుటకు వుత్తరప్రదేశ నిర్మాణ కార్యకర్తలు నిర్ణయించుకొనిరి. ఈవిధంగా ఒక నిర్ణయమైన వుద్దేశ్యముతో గమ్యాన్ని చేరుటకు ప్రయత్నించుట, భూదాన వుద్యమంలో యిదే ప్రారంభము. ఇదిభూదాన వుద్యమచరిత్రలోని ముఖ్యఘట్టం. మధురలో కార్యకర్తల సమావేశంలో వుపన్యసించుచూ, వినోబాజీ మనదేశముయొక్క ప్రత్యేకత దీని ఆధ్యాత్మిక చింతనలో వుందనియు, ఏమహాత్తర ఆత్మబలవ హిందూదేశం ఒకవిశిష్టమైన విధానములో స్వరాజ్యాన్ని సంపాదించగల్గినదో, దానిఆధారంపైననే వుద్యమంకొనసాగింపబడుచున్నదని, అవిశ్వాసంతోనే తాము భూదాన వుద్యమ లక్ష్యం 5 కోట్ల ఎ॥ భూమి సేకరణ అని నిర్ణయించినామని అన్నారు. జాతీయ చరిత్రలో నేడుచాల క్లిష్టమైన

స్థానంలో నున్నామని, కటిసమస్యను అహింసా సూత్రముద్వారా పరిష్క రింపబడని యెడల, సర్వనాశనం కాగలదని, దీనిని సాధించవలెనన్న దేశం లోని అన్నిశక్తులు అత్యుత్తమ స్థానంలో కృషిసల్పాలని కోరిరి. సర్వోదయ కార్తలెల్లరు, తమ సర్వశక్తులను యీవుద్యమానికి అర్పించాలని కోరిరి. ఉత్తర ప్రాంతములో భూదాన వుద్యమాన్ని నడిపించిన ప్రధాన వ్యక్తులు శ్రీబాబా రాఘవదాసు, మరియు శ్రీ కరన్‌భాయి. ఢిల్లీనుంచి వినోబాజీ మీరట్‌ప్రవేశించిరి. అచ్చట వుపన్యశించుచూ, భూదానవుద్యమం కేవలం భూసేకరణకే కాదని, ఇది సమాజక మూల సూత్రములను మార్పు జేసేదని యిది అహింసద్వారా హిందూదేశం యేవిధంగా సాధించగలదని యావత్తు ప్రపంచం ఎదురుచూచుచున్నదని అన్నారు. 30. నవంబరు తేదీన వినోబాజీ మీరటు జిల్లాలోని "సర్ధాన" నుంచి "కతేలి" వెళ్ళుచుండగా మార్గంలో సైకిలుతో ఢీకొనిరి. వినోబాజీక్రింద పడిరి. దెబ్బతగిలెను. కానివారు మామూలుగా తమ పదయాత్రను కొనసాగించిరి తీవ్రమైన గాయాలు తగిలినప్పటికి, వారు తమ కార్యక్రమమును మార్చ అంగీకరింప బడకుండిరి. క్రమంగా ఆబాధ అధికమయ్యెను. వినోబాజీ మాత్రము తను నిర్ణయ ప్రకారము కార్యక్రమము కొనసాగించిరి. డెరఫన్ జిల్లాలోని "కాల్సి" లో వుపన్యశించుచూ పూర్వం రాజులు అశ్వమేధయాగం చేసేవారని, తాము ప్రజాసూయయాగమును కొనసాగించుచున్నామని అన్నారు. వినోబాజీ భూదానముగాక, బావులు, ఎడ్లు మొదలగు వ్యవసాయ పనిముట్లు నుగూడ దానమడుగ ప్రారంభించిరి. ఉత్తరప్రాంతములోని కోహిల్ ఖండులో నున్నప్పుడు ఎన్నికలసమయముండెను. ఈఎన్నిక తీవ్రతలో భూదాన వుద్యమం జరుగుట కష్టసాధ్యమని, కొన్నిదినములవఱకు దీని నాపు చేయమని కొందరు వినోబాజీని కోరగా, తాము పరమేశ్వరుని ఆజ్ఞాపాలకులని, భగవంతుడేకోరిన తమ కార్యక్రమమేగాక, తామె సమాప్తిచెంద గలమని అన్నారు. ఎన్నికల కార్యక్రమం తీవ్రంగా జరుగుచున్నప్పటికి, వినోబాజీ ప్రవచనములకు ప్రజలు అధికముగా హాజరవుతూ వుండెడివారు. భూదానంకూడ యధాప్రకారం లభించెడిది.

ఉత్తమ ప్రాంతములోని 18 జిల్లాలలో తమ పదయాత్రను పూర్తి చేసికొని, వినోబాజీ 22 ఫిబ్రవరి 1952 తేదీన, "సీతాపురం" లో ప్రవేశించిరి. ఈ 90 దినముల యాత్రలో 1, 747 దాతలనుండి 28, 308 ఎక

రముల భూదానం లభించినది. వినోబాజీ ఈవుత్తర ప్రదేశ యాత్రలో గ్రామ జీవితాన్ని చిత్రించే అనేకమైన దృశ్యాలు కనుగొనబడినవి. వానిలో నుండి మూడింటిని మాత్రము వుదహరించుచున్నాము. మొరడాబాద్ జిల్లా లోని చౌధాపూరు గ్రామంలో రాత్రి 1 గం||కు వినోబాజీని కలియుటకు రామచరణ్ అనే అంధుడు వారి మకాంకు వచ్చిరి. ఒక కార్యకర్త వీరిని చూచి కారణము విచారించగా పేదలకొఱకు బాబా భూమిని ప్రోగు చేయుచున్నారని తాము విని వుంటిమని తమవద్దనున్న 12 సెంట్ల భూమిని తాము దానమివ్వదలంచుచున్నామని తెలిపి, దానపత్రవ్రాసి యిచ్చి, 6 మైళ్ళు నడచి, తిరిగి వెంటనే తమ గ్రామమునకు వెళ్ళిపోయిరి. మరుసటి దినము సమావేశములో ఈసంఘటనను గురించి మాట్లాడుచూ వినోబాజీ రామచరణ్ అంధుడని పేర్కొనబడుచున్నారని, వానివాస్తవానికి మన మందరము అంధులమని అన్నారు. రామచరణ్ రూపంలో పరమాత్ముడే ఈభూదాన యజ్ఞాన్ని ఆశీర్వదించుటకు విచ్చేసినారని తెల్పినారు.

నైనితాల్ జిల్లాలోని "కలమాంగి" అను గ్రామంలో ఒకవృద్ధు రాలు బాబాజీ పేదలనిమిత్తము భూదానాన్ని సేకరించుచున్నారని విని తనగ్రామమునుంచి నడచివచ్చి రాత్రి 11 గం|| వచ్చి మకాంచేరెను. అందరు నిద్రించుచుండిరి. ఉదయము 3 గంటలకు వినోబాజీ కార్యదర్శియైన శ్రీ దామోదర దాసు ముందాడ ప్రార్థన గంటనుకొట్టి, కాలకృత్యములు తీర్చు కొనుటకు వెలుపలకు రాగా ద్వారమువద్ద కూర్చునివున్న ఆవృద్ధనారీమణిని జూచిరి. ఆమెతనభూమిని ఒకఇంటినికూడ దానమిచ్చి, వెంటనే సంతోష ముతో తన గ్రామము తిరిగి వెళ్ళిపోయెను.

గోరక్‌పూర్ జిల్లాలో ఒక గ్రామములో ప్రవేసించగనే గీతముల తోను, హారతులతోను గ్రామస్త్రీలు వినోబాజీని స్వాగతము పాడిరి. ఒకవృద్ధ నారీ ముందుకువచ్చి, మిక్కిలి సిగ్గుతో తనకు 12 సెం|| భూమి వుందని, తనకు 5గురు పుత్రులున్నారని, బాబూజీని తన 6వ. వానిగా స్వీకరించి, 6వ. భాగమైన 2 సెంట్లు భూమినివ్వ వాంచించుచున్నామని తెల్పిరి. వినోబాజీ అతివినయముతో దానిని స్వీకరించి, ఈరెండు సెంట్లు 2 లక్షల ఎకరములతో సమానమని, ఆమాతృదేవి ఆశీర్వచనము తమకు లభించినదని, సాయం సమావేశములో పేర్కొనినారు.

సీతాపురినుండి వుత్తర ప్రాంతములోనే తూర్పుజిల్లాలో పర్యటించిరి.

ఇచ్చటి ప్రజలు అత్యుత్సాహముతో వినోబాజీ సందేశములను వినిరి. అనేక మంది కమ్యూనిష్టులుగూడ వీరి సమావేశములకు హాజరవుటయేగాక, స్వాగత పత్రములనుగూడ సమర్పించిరి. ముజఫ్ఫూరు జిల్లాలో ఒక గ్రామంలో నూలు వడికే కార్యక్రమంలో కొందరు గ్రామస్థులు పాల్గొనిరి. ఆశ్చర్యకరమైన విషయమేమన్న ఇద్దరు స్త్రీలు తమ నేత్రములను బంధించుకొని నూలువడికిరి సాయంకాల సమావేశంలో వుపన్యసించుచు సూర్యకాంతిగాని, చంద్ర కాంతిగాని లేని చీకటిసమయములో రామనామస్మరణతో నూలువడకుట అత్యుత్తమ విధానమని ప్రతివారు స్వయంగా నూలువడికి, తమబట్టను తయారుచేసుకొనేవరకు, దేశంలో పేదరికం తొలగింపబడదని అన్నారు. ఏప్రిల్ 13, 14, 15, 16, తేదీలలో సేవాపురిలో శ్రీ శ్రీ. కృష్ణదాసు జాజూజీ అధ్యక్షతన చతుర్థ వార్షిక సమ్మేళనము జరిగెను. ఈసమయమునకు, దేశంలో మొత్తం 1 లక్ష 2 వేల మూడువందల అరవైఒకటి ఎకరముల భూమి 4936 మంది దాతలనుండి సేకరింపబడెను. ఈసమ్మేళనమును ఆచార్య కృపలానీ ప్రారంభించిరి. వినోబాజీ తమ త్రివిధమైన కార్యక్రమ విధానములను వివరించుచు, సమ్మేళన సందర్భమున, ప్రతివ్యక్తి గాంధీజీ స్మారకంగా ఒక్కొక్క చిలప, తాను స్వయంగా వడికి ఇవ్వవలెనని సర్వోదయ స్థాపనకు, ఒక్కొక్క చిలుప ఒక్కొక్క ఓటు కాగలదని అన్నారు. తమ రెండవ విధానాన్ని వివరించుచు, ప్రతిసంస్థ ధనంనుంచి విముక్తి పొందవలెనని, దీనివలన గ్రామోద్ధరణ, దేశోద్ధరణ జరుగగలదని, దీని ప్రభావము ప్రభుత్వముపైగూడ పడగలదని అన్నారు. తమ మూడవ విధానం భూదాన యజ్ఞమని, ఇదేసమాజ విప్లవమునకు మూలసూత్రమని అంటూ, "కార్యకర్తలు విశ్వాసంతో త్రికరణ శుద్ధిగ పనిచేసిన సఫలత లభించగలదు. కర్తృత్వము శ్రద్ధను అనుసరించును. నిష్ట కర్తృత్వమును అనుసరించును. నైతిక శక్తితో సమస్యా పరిష్కారము పొందదలచిన, మనందృఢ విశ్వాసముతో కార్యరంగములో కృషిచేయవలె"నని తెల్పినారు. సేవాపురిలో సమావేశమైన కార్యకర్తలెల్లరు నూతన వుత్సాహముతోను, ఆశతోను, తమతమ గృహములు చేరిరి. రెండు సంవత్సరములలో 25-లక్షల ఎకరముల భూమి సేకరించుటకు నిర్ణయించుకొనిరి.

సేవాపురి సమ్మేళనము భూదాన వుద్యమమునకు ఒక చారిత్రాత్మక మార్గమునిచ్చు అభివృద్ధిని సూచించినది. 20 ఏప్రెల్ 1952 తేదీన సేవాపురి

విడిచి, వినోబాజీ వుత్తరప్రదేశములో మిగిలియున్న 15 జిల్లాల యాత్ర ప్రారంభించిరి.

మే 1వ తేదీన ఫైజాబాదులో నుండగా ప్రపంచమంతటను కార్మిక దినము జరుపబడెను. ఈ సందర్భమును పురస్కరించుకొని, వినోబాజీ తమ వుపన్యాసములో తమవుద్యమం కార్మికులకు సంబంధించినదేనని, సాధారణంగా హిందూదేశములో ఈవిధమైన కార్మిక వుద్యమములు పట్టణాలలోనే కొనసాగింపబడుచున్నవని, రైతు కార్మికులకు ఏవిధమైన నిర్మాణాత్మకమైన సంస్థలేదని అన్నారు వ్యవసాయంతప్ప ఇతర ఏవృత్తులు వీరభ్యసించుటలేదని, హీనాతి హీనస్థితిలో భూమి హీనులై ఇతరుల పొలాలలో పని చేయుచున్నారని వివరించిరి. "నావుద్యమం కార్మిక వుద్యమం. స్వయంగానే నొక కార్మికుడను, 32 సం॥లు కార్మికులుగా పనిచేసినాను. సంఘముచే నీచవృత్తులుగా పరిగణింపబడుచున్న పాకీపని, నేతపని, పొలం పని, వడ్రంగిపని, చేసితిని. నేటి వుద్యమం భూసమస్యను పరిష్కరించగలదు. ఆహార వుత్పత్తి నభివృద్ధిచేయగలదు. గ్రామ రాజ్యములను స్థాపించగలదు. ప్రభుత్వముపై ఒత్తిడితీసికొని రాగలదు. ప్రజల ఆధ్యాత్మిక చింతనను పెంపొందించగలదు. ప్రజల నైతిక జీవితమును తీర్చి దిద్ది తదయావుదారతనము పెంపొందించగలదు". వినోబాజీ లక్నోలో నుండగా బుద్ధజయంతివచ్చెను. ఆదినము హృదయము విప్పి వినోబాజీ అనేక విషయములనుగురించి వుపన్యసించిరి. "బుద్ధుని భోదనలు క్రమక్రమంగా నేడు గుర్తింపబడుచున్నవి. బుద్ధుని మొదలు మహాత్మాగాంధీజీవరకు, వందలకొలది యోధులు శాంతములో క్రోధాన్ని జయించగలమని అధైర్యమును ధైర్యముతోను, శతృత్వమును ప్రేమతోను, జయించగలమని భోదిస్తూవచ్చిరి. కాని అవియన్ని వ్యక్తిగత పరిశోధనలకే సాగింపబడివుండెను. వీనిని విస్తరింపజేసి సమాజాన్వితము చేయలేదు.

హిందూదేశము అహింసామాత్రము ద్వారనే స్వరాజ్యం సంపాదించుకొనగల్గినదని నేను అనజాలును. గీతలో చెప్పినట్లు యేఫలితమునకైనను పంచ మాత్రములు అవసరము. హిందూదేశ స్వాతంత్ర్య ప్రాప్తిలో అహింసా విధానం ప్రముఖస్థానం ఆక్రమించి యుండదని మాత్రము చెప్పవలసివున్నది. మన సమాజ నిర్మాణాన్ని నిర్ణయించుకొనుటకు మనకీరోజు స్వాతంత్ర్యము ద్వారా స్వేచ్ఛలభించినది. మనదేశం పెద్దది. మన భాధ్య

తలు వివిధ ముఖములై వున్నది. ఆర్థిక, సమాజిక ఔన్నత్యము మన మనుసరించే మార్గముపై ఆధారపడియున్నది. మన సమస్యాపరిష్కారమునకు వుత్తమ పద్ధతిని దీర్ఘంగా ఆలోచించి నిర్ణయించుకొనవలసివున్నది. అహింసాయుతంగా సమస్యాపరిష్కారం జరిగిన, మనభారత దేశానికేగాదు, యావత్తు ప్రపంచానికి చక్కటి బాటను చూపగలము. ఈనాడు ప్రపంచాన్ని ఎదుర్కొనుచున్న సమస్యలలో భూసమస్య పెద్దది. భూమిగలవారు తమ ధర్మాన్ని గుర్తించి, భూమి హీనులకు తమకున్న దానిని పంచి యివ్వవలయును. బుద్ధునిచే ప్రారంభింపబడిన కార్యమున కాపరమేశ్వరుడు నా ద్వారా కొనసాగించుచున్నాడు. విశ్వాసంతో యీకార్యాన్ని మనం శాంతి, అహింసా మార్గాలద్వారా సాధించగల్గిన, హిందూదేశం యావత్తు ప్రపంచమునకు మార్గదర్శి కాగలదు.''

లక్నోను వదలి, మే 13 తేదీన వినోబాజీ కాన్పూరు చేరెను. జిల్లా మొత్తము కోటాను ప్రథమ దినముననే సేకరించిన మొట్టమొదటి ప్రదేశమిదియే. ఇచ్చట సుమారు 13,000 ఏకరముల భూదానం లభించినది. వినోబాజీ కాన్పూరు కోటాను లక్ష ఎకరములకు పెంచిరి. ఇచ్చట వినోబాజీ హరిజనుల కాలనీని ప్రారంభించిరి. ఈసందర్భములో వుపన్యసించుచు ప్రజల ప్రతిష్ట వారి వున్నతమైన భవనాలపై ఆధారపడి వుండజాలదని, హరిజన వాడలపైననే ఆధారపడి వుండగలదని, బలహీనులూ పరమేశ్వరుని శక్తిని అనుభవించగలరని అన్నారు. ఉత్తర ప్రదేశములో ప్రప్రథముగా వినోబాజీ "కాన్పూరు" జిల్లాలోని "పుప్రాయను" గ్రామంలో భూపంపిణీ జరిపినారు. భూపంపిణీ సమావేశాన్ని ప్రారంభిస్తూ, భూపంపిణీ అత్యధిక ప్రేమతోను, న్యాయముగాను, జరుగవలెనని తెలిపిరి. మే 18వ తేదీన వినోబాజీ బుందేలఖండు ప్రాంతములో ప్రవేశించిరి. ఇచ్చట "హమిరెపూర్" జిల్లాలో "బెట్వా" గ్రామం నుంచి "ఇటాలియా" అను గ్రామంచేరు దారిలో నున్న "మనెగ్రోత్" అనే గ్రామంలో 101 ఎకరములు భూదానం లభించినది. వారిచ్చిన దాన పత్రములు స్వీకరించుచు, వినోబాజీ "భూమియంతా గోపాలునది" అని అంటూ తమపదయాత్రను సాగించిరి. ఈమాటలు గ్రామసుల హృదయములలో చొచ్చుకొనిపోయెను. ఆ గ్రామములోనే గౌరవనీయులైన శ్రీమంతుల కుటుంబమునకు జెందిన దివాను షత్రుఘ్న సింగు అనువారు

తన అపార సేవాలను ప్రజల హృదయములలో ప్రముఖస్థాన మేర్పరచుకొనియుండిరి. గ్రామములో తనకున్న భూమినంతా వినోబాజీకి దానమిచ్చి తమయభిప్రాయములను వెల్లడించిరి. గ్రామమంతా గ్రామదానంగా సమర్పించుటకు ప్రజలకు ప్రభోధించెను. గ్రామములో మొత్తము 105 కుటుంబములుండెను. వానిలో 65 కుటుంబములు భూమి గలిగి, 40 కుటుంబములు భూమిలేనివిగా నున్నవి. శ్రీ సత్రుఘనసింగు ప్రయత్న ఫలితంగా 64 కుటుంబములు దాన మిచ్చుటకు అంగీకరించెను. ఈగ్రామ ప్రజలందరు భూమికి యజమాని పరమేశ్వరుడే అనే సత్యాన్ని పూర్తిగా గ్రహించగలిగిరి. ప్రథమ భూధానము లభించినప్పుడు వినోభాజీ ఎంత ఆనంత మనుభవించిరో అంత ఆనందము ఈవిచిత్ర సంఘటన వలన వారికి లభించినది. తులసీదాసు నామము ప్రఖ్యాతిపొందిన “బందా” అను జిల్లాలో 20000 ఎకరముల భూదానం లభించినది. త్వరలోనే మరి 80000 ఎకరముల భూమిని సేకరించుటకు వాగ్దానముజేసిరి. 36 సం॥లకు పూర్వము గాంధీజీని ప్రప్రథమము గావలసిన ప్రవేశమైన “ఫతేపూర్” జిల్లాకు వినోబాజీ 7 జూన్ 1952 తేదీన చేరిరి.

“ఫతేపూర్,” “రాయబరేలి,” “సుల్తాన్ పురము,” “ప్రతాపఘర్,” జిల్లాలలో పర్యటించి 1952 సం॥ జూన్ 23 తేదీన “ఆలహాబాదు” జిల్లాలో ప్రవేశించిరి. శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ మొదలగు ప్రముఖుల స్వాగత మిచ్చిరి. శ్రీ టాండన్ మాట్లాడుచు వినోబాజీ ఒక తపస్వీఅని, వారిచుట్టూ విచిత్రమైన నూతన వాతావరణంలో క్రాంతి ఆవరించియున్నదని అన్నారు. సాయంకాలము ప్రార్థనానందర సమావేశములో వుపన్యసించుచు, వినోబాజీ తాము కేవలం భూమే కోరుట లేదని, ప్రజల హృదయములను కోరుచున్నానని, ప్రేమతో దానమిచ్చే ప్రతివ్యక్తి భూమినేగాక, తనహృదయాన్నిగూడ పంచి యివ్వగలడని అన్నారు. ఈకార్యం సంపూర్తిఅయ్యే వఱకు తాము విశ్రాంతి పొందదలంచుటలేదని తెల్పిరి, జూన్ 24వ తేదీన కుంభ వృష్టిగా కురియుచున్న వర్షములో “అలహాబాదు” పట్టణము చేరిరి. విద్యా రంగములోని, సంస్కృతిలోను, అభివృద్ధిపొందిన “అలహాబాదు”లో వినోబాజీ సామ్యయోగ సిద్ధాంతమును వివరించిరి. ఇచ్చట జమీందారుల సమావేశములోను' కూలివారుల సమావేశములోను, పత్రికా రచయితల సమా

వేశములోను, స్త్రీల సమావేశములోను, సాహిత్య సమావేశములలోను గూడ వుపన్యసించిరి ఈజిల్లాలో 25561 ఎకరముల భూదానము లభించి నది. ఇంత వరకు యేజిల్లాలోను ఇంత భూమి లభించియుండలేదు. వారి కోటాను లక్ష ఎకరములు నిర్ణయించుకొనుటకు కోరుచూ అన్ని పార్టీల వారు ఈవుద్యమములో పాల్గొనవలెనని, భగవదానుసారము తామీ కార్యమ్ని కొనసాగించుచున్నామని తెల్పిరి.

వుత్తర ప్రదేశంలో కట్టకడపటిజిల్లాయైన "మీర్జాపూరు" జిల్లాలో వినోబాజీ ప్రవేశించిరి. "చూనారు"లో నుండగా వుత్తర ప్రదేశ ప్రభుత్వము జమీందారి రద్దుదినమును జరిపిరి. దీనితో ఎట్టి సంబంధము వుండ కొనని వినోబాజీ సాయంకాలపు సమావేశములో బాధతో మాట్లాడుచూ దేశములో భూమి హీనులున్నన్ని దినములు, ఏవుత్సవము వలనను, ఆనందము లభించజాలదని వీరిస్థితి హీనాతి హీనముగ నున్నదని. మనము కొంత త్యాగము చేస్తేగాని, వారి వున్నతి జరుగజాలదని హిందూదేశ పౌరుడు తనతోటి భూమిహీనుడైన సోదరునకు సహాయపడినప్పుడే ప్రపంచ పౌరుడు తనతోటి భూమి హీనుడైన సోదరునకు సహాయపడినప్పుడే ప్రపంచ పౌరుడు కాగలడని తెల్పినారు. 1952వ సం|| జూలై 4 వ తేదీన వినోబాజీ తిరిగి "కాశీ" చేరిరి. వర్షఋతువు గడుపుటకై వారచ్చట సుమారు 2 నెలలు గడిపిరి. ఇప్పటికి దేశములో మొత్తము 296634 ఎకరముల భూదానము లభించినది. సేవాపురి సమ్మేళనానంతరము అధిక సంఖ్యలు భూదాన పత్రములు లభించినవి. కాశీ విద్యాపీఠములో వినోబాజీ 70 దినములు నివసించిరి ఒక దినము గంగాస్నానమునకు వెళ్లిరి. ప్రజలు పాయిఖానాగా ఆప్రదేశము నుపయోగించుట జూచి వినోబాజీ సహించలేక పోయిరి. తమప్రదేశమును పరిశుభ్రముగా నుంచుకొనవలెనని స్వాతంత్ర్య భారత మనేది సార్థకంగా చేయాలని "కాశీ" ప్రజలను కోరిరి. 1952 సం|| సెప్టెంబరు 9 తేదీన "వార్ధా"లో శ్రీ ఆచార్యకిషోర్‌లాల్ ఘనశ్యామ్‌దాసు మరణించినట్లు వార్త చేరెను. ఈ వార్తను గురించి, వినోబాజీ ఈ విధంగా చెప్పినారు. "నావుపన్యాసము లన్నింటిని నేను సరిచూడక నే వారికి పంపెడివాడను. వారిమీద అంత విశ్వాసము నాకుండెను. వాటిని మార్పుజేసిన. సరిదిద్దినా వారేదానికి తగిన అర్హులు. భూదాన వుద్యమమునకు తమసర్వస్వాన్ని అర్పించినవారు వారొక్కరే. వారు

"వార్ధా"లో వుండడము నాకెంతో బలము నిచ్చినది. ఆబలము ఆదేవిధంగా ఇక ముందుగూడ సాగగలదు. గీతలో తెల్పినట్లు కిశోర్ లాల్ భాయి సకర్మ, అకర్మలకు వుదాహరణములు. వారు బుద్ధభగవానుని స్థాయికి చెందిన వారని నేను తలంచుచున్నాను"

రెండు దినముల తదుపరి వినోబాజీ జన్మ దినోత్సవ సందర్భమున వుత్తర ప్రదేశములో కార్యకర్తలతో మాట్లాడుచూ భూసమస్య పరిష్కారముగు వఱకు పరంధామ ఆశ్రమమునకు తిరిగి వెళ్ళమని తీర్మానించుకొన్నట్లు తెల్పిరి. వినోబాజీ వుత్తర ప్రదేశం నుంచి వెళ్ళే ఆఖరి దినము వచ్చెను. "అల్మోరా" జిల్లా తప్ప వుత్తరప్రదేశమంతా పర్యటించిరి. 257 స్థలముల యందు 295028 ఎకరముల భూమిని, 231 బావులు, 1 గొట్టముబావి, 34 ఎడ్ల జతలు, 6 గృహములు, 1 భవనము, 1 ధర్మశాల, 11 నాగళ్లు, 1000 రూ. విలువగల వ్యవసాయ పనిముట్లు, 4 నీళ్లుచేదు బకెట్లు 1 లక్ష 30 వేల ఇటుకలు, 15 సంచుల సిమెంటు, 4 చెఱువులు, 15500 రూ. విలువగల 531 వృక్షములు, విత్తనములు, శ్రమదానముల మొత్తం 4 లక్షల ఎకరముల విలువగల దానం 12 వేల మంది దాతల వద్దనుంచి లభించినది. మొత్తం 3750 మైళ్లు పదయాత్రను జరిపించిరి. ఇదంతా భగవంతుని ఆశీర్వచనబలమువలననే నెరవేర గల్గినదని వినోబాజీ పేర్కొనిరి.

14 వ తేదీ ఉదయం వుత్తరప్రదేశములోని "సైయిద్ రాజ" నుంచి వినోబాజీ బయలుదేరిరి. కర్మనాశి నదిఒడ్డున "బీహారు"లో ప్రవేశించుచున్నారు. శీతలపవనములు వీచుచుండగా, నక్షత్రములు మిలమిల మెరయుచుండగా వీడ్కోలు విషాదచ్ఛాయలు కార్యకర్తల ముఖములలో ప్రస్ఫుటమగుచుండగా వినోబాజీ పడవనెక్కి "బీహారు" సరిహద్దులకు ప్రయాణము సాగించిరి.

బీహారు సరిహద్దులలో స్వాగతమిచ్చిన కార్యకర్తలతో మాట్లాడుచూ వినోబాజీ బీహారులో 4 లక్షల ఎకరములు సేకరించుటకు నిర్ణయింపబడినప్పటికి, 50 లక్షల ఎకరముల భూమి సేకరించినగాని బీహారులోనున్న భూమిహీనుల సమస్య పరిష్కరింపబడజాలదని అన్నారు. బీహారులో మొదటిమకాం "సహాబారు" జిల్లాలోని దుర్గావతిలో నుండెను. ఘోషాస్త్రీలతో సహా ప్రజలువినోబాజీకి అఖండ స్వాగతమిచ్చిరి. సాయంకాలము జరిగిన కార్యకర్తల సమావేశంలో మాట్లాడుచూ, విశాలహృదయాలలో,

వున్నతభావాలలో పనిచేయాలని వినోబాజీ కోరినారు. ప్రార్థన సమావేశంలో వుపన్యసించుచూ, యాత్రికుడు భగవంతుని దర్శనమునకై తీర్థయాత్రలు చేయునట్లు తాము భూదానయాత్ర చేయుచున్నామని, మానవునకు దానప్రవృత్తి లేనియెడల హీనస్థితినొందగలడని, కాని ప్రేమమూలమైన క్రాంతిని తాము కోరుచున్నామని తెల్పిరి. 18 సెప్టంబరున "దమూరు" లో వుపన్యసించుచూ, వినోబాజీ బీహారుప్రజలు తమ వాటాను పూర్తి చేయుటయే లక్ష్యమని తలంచక, బీహారులో భూమిహీను లెవరు వుండరాదనే నిశ్చయానికి పనిచేయాలని, యీ రాష్ట్రంలో భూసమస్య పూర్తిగా పరిష్కరింపబడి యితరరాష్ట్రాలకు ఆదర్శప్రాయము కావలయునని కోరిరి. అహింసా సూత్రముతో భూసమస్యను హిందూదేశములో పరిష్కరించిన, యావత్తు ప్రపంచానికి మార్గంచూపగలమని, బీహారులోనే ప్రప్రథమముగా గాంధీజీచే ప్రారంభింపబడిన అహింసా సిద్ధాంతమును పునర్జీవితం చేయాలని కోరిరి. పాట్నా జిల్లాలోని "ధప్రా" గ్రామములో వుపన్యసించుచు, తాము కేవలం భూమి పంపిణీనే కోరుటలేదని, గ్రామపరిశ్రమలు నెలకొల్పబడాలనికూడా కోరుచున్నామని అనిరి. గ్రామవస్తువుల ఖరీదు అధికమనుట తప్పని, విషము చౌకగాను, అమృతము పిరియముగా నున్నప్పటికి విషమును వాంఛించమని వుదహరించిరి. 23 అక్టోబరున వినోబాజీ పాట్నా నగరములో ప్రవేశించి, మూడుదినము లచ్చట గడిపిరి. బీహారులోని భూసమస్యను పూర్తిగా పరిష్కరించకోరుచున్నామని, ప్రతి ప్రాంతమునకు వెళ్ళి, స్వయంగా భూమి సేకరించుట అనేది కష్టసాధ్యమేగాక, అధిక కాలాన్ని కోరుతుందని, బీహారుని ఆదర్శప్రాంతముగా చేసి, దాని అనుసారంగా యితరప్రాంతములలో పని జరుపవలెనని తాము కోరుచున్నామని తెల్పిరి.

ప్రారంభములో బీహారులో అంతవుత్సాహముగా పని జరుగలేదు. అప్పటికిని వినోబాజీ ధృఢవిశ్వాసముతో, తమ కార్యక్రమాన్ని కొనసాగించినారు. బీహారు రాష్ట్రములో భూసమస్య పరిష్కరింపబడువరకు యీరాష్ట్రమును విడువమని తమ నిశ్చయాన్ని వినోబాజీ 23 అక్టోబరు తేదీన వెల్లడించిరి. దీని ప్రభావము బీహారుపైననేగాక, యావత్తు దేశముపై బడెను. హిందూదేశములో ప్రజాప్రభుత్వము నెలకొల్పినతరువాత, యీ విధమైన ఆశ్చర్య జనకమైన, చారిత్రాత్మకమైన, విచిత్ర నిర్ణయము నెవరు

చేసికొని వుండలేదు. ఇది చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపబడి గలదు. మరుసటిదినము వినోభాజీ సంపత్తిదానము గురించి బహిరంగ సమావేశంలో వివరించిరి.

"భూదాన వుద్యమం వ్యాప్తి పొందుచున్న కొద్ది, దీని మూల సిద్ధాంత ప్రాప్తికి యీ వుద్యమాన్ని యింకను విస్తరింపజేయవలసివున్నది. దీనికి సంపత్తిలో భాగముగూడ దానమివ్వవలయును. సంపత్తిలో 6 వ భాగమిచ్చుటకు నేను కోరుచున్నాను. ఆపైన ప్రజలు తమ కర్తవ్యాన్ని గుర్తించి, తమ శక్త్యానుసారము నిర్ణయించుకొనవచ్చును". "సంపత్తిదానమునకు నిధులు, విరాళములకు భేదమున్నది. సంపత్తిదానమున్న రాబడిలో ఒక భాగము ప్రతిసంవత్సరము దానమివ్వవలెను. దానమిచ్చిన సొమ్ము దాత వద్దనే వుండును. మేము తెల్పునట్లు, అతడు ఆసొమ్మును ధర్మకార్యములకు వినియోగించవలెను. ప్రతిసంవత్సరము దానిలెక్కలు మాకు పంపుచుండవలెను". 25 అక్టోబరున భూదాన యజ్ఞమున సమర్థించుచూ, బీహారు రాష్ట్ర కాంగ్రెసు సంఘము ఏకగ్రీవముగా నొక తీర్మానముజేసెను. ఏ రాష్ట్ర కాంగ్రెసు సంఘముగాని, భూదాన వుద్యమ విషయములో యీ విధమైన గంభీర చింతనచేసి, ముందడుగువేయుట యిదే ప్రధమము. 28 ఫిబ్రవరి 1953 వ నాటికి బీహారులో 4 లక్షల ఎకరముల భూమి సేకరించబడవలెనని, ఇందునిమిత్తమై, బీహారులోని కలతలు, ప్రభుత్వములోని కాంగ్రెసు శాశనసభ్యులు, ఇతర కాంగ్రెసు కార్యకర్తలెల్లరు తీవ్రమైన కృషిసల్పి, లక్ష్యసిద్ధికి తోడ్పడవలెనని, యిది జయప్రదముగ కొనసాగింపబడుటకు ప్రప్రధమముగా, కాంగ్రెసువారందరు తమకున్న భూమిలో 6 వ భాగము దానమివ్వవలెననియు, ఆ తీర్మానములో పేర్కొనిరి. ఆ తీర్మానము శ్రీ వైద్యనాద్ చౌదరీచే బీహారుప్రాంత కాంగ్రెసు సంఘ కార్యదర్శిచే ప్రతిపాదింపబడి, శ్రీ ప్రభునాద్‌సింగుచే బలపరచబడెను. శ్రీ వైద్యనాద్ ప్రసాదుగారిప్పుడు పూర్తిగా భూదాన కార్యక్రమంలోనే నిమగ్నులై వున్నారు. ఇదేదినమున బీహారు సర్వోదయ కార్యకర్తలుకూడ భూదానము గురించి ఏకగ్రీవముగా ఒక తీర్మానముజేసిరి. ఆశ్చర్యకర విషయమేమనగ, యీ తీర్మానము బీహారు ప్రాంత ప్రజా సోషలిష్టు సంఘ అధ్యక్షులైన శ్రీ చందాసాహెబుచేత ప్రతిపాదింపబడి, కాంగ్రెసు నాయకులైన శ్రీ జగత్ నారాయణలాల్ చే బలపరచబడెను. ఈవిధంగా ఈరీ దినములలో,

జనకుడు, బుద్ధుడు, మహావీరుడు, గాంధీ మొదలగు మహాత్ముల ప్రదేశమైన, బీహారులో అహింసాయుత విప్లవమునకు అనుకూలమైన వాతావరణ మేర్పడెను. కాని వినోబాజీకి తృప్తికలుగలేదు. తమ దృష్టినంతా ఒక జిల్లాలో కేంద్రీకృతముచేయ నిర్ణయించుకొనిరి. ఈ వుద్దేశ్యములో 28 అక్టోబరు తేదీన వినోబాజీ "గయ" జిల్లాలో ప్రవేశించిరి.

దీర్ఘ చింతనానంతరము బుద్ధభగవానుని యీజిల్లాలో లక్షఎకరాల భూమి లభించవలెనని ప్రకటించిరి. బుద్ధగయలో మాట్లాడుచు వినోబాజీ బుద్ధుడు, వేదాలు, ఋషులుచేసిన భోదనలనే, అనుసరించుచు, వారి అడుగుజాడలలోనే తాము సంచరించుచున్నామని తెల్పిరి. తమ కార్యదర్శి అయిన శ్రీ దామోదరదాసు ముందాడును, వారి కార్యభారమునుంచి తొలగించి, యీ జిల్లాలో తమ ఆశయసిద్ధికై తీవ్రప్రయత్నము చేయుటకు కోరిరి. శ్రీగౌరీశంకర్ శరణ్ సింగు అధ్యక్షతన 'గయ' జిల్లాలో భూదాన సేకరణ సమయ మేర్పరచబడెను. 22 నవంబరున "పాలమౌ" జిల్లాలోని "చాందనా" గ్రామంలో ఒక్కేదినమున 400 దాన పత్రములు సమర్పింపబడినవి. ఇంతవరకు యేదినమునకూడా యిన్ని దానపత్రములు సేకరింపబడలేదు.

"రాంచీ" జిల్లాలో, పాల్కోట జమీందారు లాల్సాహెబు, హృదయపూర్వకమైనసేవ భూదాన వుద్యమమునకు చేయగలమని తెల్పిరి. "సింగభూమి" జిల్లాలో ప్రవేశించిన తదుపరి వినోబాజీకి జబ్బుచేసెను. వారు నడువలేని స్థితిలో నున్నప్పటికి, కార్యక్రమము జరుపుటకు పట్టుబట్టిరి. ఎడ్లబండిలో ప్రయాణముచేసి, "మానభూమి" జిల్లా ప్రవేశించిరి. కాని వారి యారోగ్యమింకను క్షీణించెను. బండిపైకూడ వెళ్ళలేని స్థితి యేర్పడెను. పంచమ సర్వోదయ వార్షిక సమ్మేళనమువరకు, వినోబాజీ "చాండిల్" లోనే వుండిపోయిరి. ఈ క్రింది పట్టిక సేవాపురి, చాండిల్ సర్వోదయ సమ్మేళనముల మధ్య కాలములో భూదాన వుద్యమ అభివృద్ధిని తెలుపగలదు. అనగా మే 1952 నుంచి ఏప్రెల్ 1953 వరకు లభించిన భూమి వివరములు.

ఈసమయములోని అతిముఖ్యఘటన యేమన, శ్రీ జయప్రకాష్ నారాయణ, తమ యావత్తుశక్తిని భూదాన వుద్యమం కొరకు వినియోగించగలమని ప్రకటించుట, మరియొక ఆశ్చర్యకరమైనవిషయం. ధనవంతులపై

పడిన ఈ వుద్యమప్రభావం "చాండిల్"లో రామఘర్ రాజా వినోబాజీని కలిసి, లక్ష ఎకరములు దానమిచ్చుటకు వాగ్దానముజేసిరి. "చాండిల్" సర్వోదయ సమ్మేళనమునకు శ్రీ జీకేంద్రముజుందారు అధ్యక్షతవహించిరి. ఈ సందర్భమున, మధ్యపాననిషేదముగురించి ఒక తీర్మానము, మరిరెండు తీర్మానములు భూదానము, గ్రామరాజ్యముల గురించి తీర్మానించబడెను. ఈ సందర్భమున శ్రీ జయప్రకాష్‌నారాయణ మాట్లాడుచూ, స్వాతంత్రానంతరము, హిందూదేశప్రజలు నిస్తేజమైవున్న సమయమున, వినోబాజీ ప్రజలకు ఒక మార్గాన్ని చూపించినారని, నూతన సమాజస్థాపనకు భూదాన యజ్ఞం పునాదివేసిందని, అన్నిపార్టీలవారు కనీసం ఒకసంవత్సరమువరకైనను, తమతమ కార్యాలను విడచి, భూదాన కార్యక్రమాన్ని కొనసాగించాలని కోరిరి. వినోబాజీ తమ ప్రారంభోపన్యాసములో అనేకవిషయముల గురించి వివరించిరి. దయగురించి మాటలుచెప్పుటకాదు. దయతోకూడిన రాజ్యాన్ని మనం నిర్మించాలని. జనశక్తి నిర్మాణం జరుగవలయునని, కోరిరి. భూదాన వుద్యమం హృదయపరివర్తనపై ఆధారపడివున్నదని, ఎవరిని ఏ విషయములోను నిర్భందించు విధానమే లేదని, ప్రతివ్యక్తికి నచ్చచెప్పుట ద్వారానే తమ వుద్యమఫలితాన్ని తాము ఆశించుచున్నామని అన్నారు.

తమ ఆశయసిద్ధికై నిర్ణయించుకొనిన చతుర్విధసూత్రములను వినోబాజీ తెల్పిరి. (1) నిర్మాణ కార్యక్రమ సంస్థలన్ని ఏకరూపంతో, ఐక్యత పొంది పనిచేయుట. (2) 1957 సం॥ నాటికి 5 కోట్ల ఎకరముల భూమి సేకరించుట, (3) సంపత్తిదాన యజ్ఞము. (4) సూత్రదానము, కార్యకర్తలెల్లరు, కనీసం ఒకసంవత్సరంవరకైనా, తమ యితర కార్యక్రమాల నన్నిటిని నిలిపి, భూదాన వుద్యమానికి తమ సర్వస్వాన్ని అర్పించి, కార్యక్రమాన్ని హృదయపూర్తిగా, ఆత్మశుద్ధితో కొనసాగించాలని వినోబాజీ కోరినారు.

"చాండిల్" లో జరిగిన సర్వోదయ సమ్మేళనము కార్యకర్తలకు నూతనోత్సాహమిచ్చి, భూదానవుద్యమంలో అకుంఠిత విశ్వాశాన్నిచ్చినది. దాదాపు 3 మాసములు "చాండిల్"లోగడిపిన తదుపరి, 12 మార్చి, 1953 తేదీన వినోబాజీ తమ యాత్రను బీహారులో తిరిగి ప్రారంభించిరి. "హజారీబాఘ" జిల్లాలోని "గిరిధి" లో "ధనబడ్" రాజా ఒకలక్ష ఎకరముల భూమి దానమిచ్చెను. ఇప్పటివరకు ఇంతదానము ఏవ్యక్తివద్దనుంచి లభించ

లేదు. వినోబాజీ తిరిగి "గయ" పట్టణమునకు వచ్చినప్పుడు బీహారు రాష్ట్ర కాంగ్రెసు సంఘము, వినోబాజీ కోరిన ప్రకారము, 32 లక్షల ఎకరముల భూమి సేకరించుటకు అన్ని కాంగ్రెసు కమిటీలు కృషిసల్పవలెనని తీర్మానించెను. 31 ఆగష్టు 1953 నాటికి ప్రతిజిల్లా తమతమకోటాను పూర్తిచేయవలెననిగూడ తీర్మానించెను. "రంకే" గ్రామంలో నుండగా ఆ గ్రామ రాజా వినోబాజీని కలిసి, తాను ఒక కార్యకర్తకు 2,500 ఎకరముల భూమిని, మరియొక కార్యకర్తకు 11,000 ఎకరముల భూమిని దానమిచ్చినట్లు తెల్పెను. వినోబాజీ యీ భేదమునకు కారణమేమని అడుగగా, వారెంత అడిగిన అంత దానమిచ్చినట్లు తెల్పిరి. వెంటనే వినోబాజీ తమకేమివ్వగలరని ప్రశ్నించినా, కోరినంత యివ్వగలమని జవాబిచ్చిరి. తమకు లక్ష ఎకరముల బంజరుభూమి, 9,000,10,000 ఎకరముల మధ్య స్వంతముగా వ్యవసాయం చేసికొనే భూమి త్రుందని, దీనినుంచి సుమారు 3,000 ఎకరముల భూమి రైతులకై ప్రత్యేకింపబడియున్నదని రాజా తెల్పగా, వినోబాజీ వారి బంజరుభూమినంతను స్వంతముగా వ్యవసాయము చేయుచున్న భూమిలో 6–వ భాగము దానమిచ్చుటకు కోరగా వెంటనే రాజాగారు అంగీకరించిరి. ఆవిధముగా "రంక" రాజా 1,02,001 ఎకరముల భూమిని దానమిచ్చెను. వినోబాజీ తమ ఉపన్యాసములో యీవిషయమై పేర్కొనుచు, దీనిని పూర్ణదానమని తెల్పిరి. "రాంచీ" జిల్లాలో "నెటార్‌హాట్" గ్రామంలో నుండగా, ఆ జిల్లా భూదాన సంచాలకులైన పాలకోటరాజా 45,132 ఎకరముల భూదానాన్ని సేకరించి సమర్పించిరి. రంక రాజావలె తమ బంజరుభూమినంతయు, వ్యవసాయములోనున్న భూమిలో 6–వ భాగమును, మొత్తం 44,500 ఎకరముల భూమిని స్వయంగా దానమిచ్చిరి. 15 జూన్‌న, వినోబాజీకి 632 మంది దాతలనుంచి 1,401 ఎకరముల భూమి దానమివ్వబడెను. దీనిని వినోబాజీ విష్ణుసహస్రనామపఠమని పేర్కొనిరి. భూదానచరిత్రలో యిన్ని దానపత్రములు లభించుట యిదే ప్రథమము. 16 జూన్ నుంచి వినోబాజీ తమ కార్యక్రమములో నూతనవిధానాన్ని ప్రవేశపెట్టిరి. తమ మకాం చేరగనే, కొన్ని పారలు తెప్పించి, అరమైలుదూరములోనున్న బంజరుభూమిని త్రవ్వుటకై తమ సహచరులతో బయలుదేరిరి. దినమునకు 17 నిముషములు త్రవ్వెడివారు. క్రమక్రమంగా దినమునకు 1 నిముషము చొప్పున యీ కాలాన్ని పెంచుతూవచ్చిరి. "రంచి" లో బీహారుప్రదేశ భూదాన కార్యకర్త

శిబిరము మూడుదినములు నడిపించబడెను.

"హజారిబాఘ" జిల్లాలో యాత్రఅంతయు వినోబాజీ "రామఘర్" రాజా పాల్గొనెను. ఈ రాజా కేంద్రస్థానమైన "పద్మా" చేరగనే, కుటుంబీకులు 2,000 ఎకరముల భూమి దానమిచ్చెను వినోబాజీ శ్రమదినములో రాజాకూడ పాల్గొనెను. వినోబాజీ యీ సందర్భమున ఈవిధముగా అనిరి. "ఈదినము తెల్లబట్టలవారుకూడా భూమిత్రివ్వే కార్యక్రమములో పాల్గొనిరి. కాలముమార్పు నిది తెల్పుచున్నది ఈరోజు ఎవరు అధిక తెల్లబట్టలను ధరించ వాంఛించుటలేదు. మన భగవంతుడు కృష్ణుడు"కృష్ణ" అన్న నలుపుఅనిగాని వ్యవసాయము చేయువాడని కాని అర్థము. హిందూదేశములో వ్యవసాయము చేయు ప్రతి వ్యక్తి నల్లగనుండును. నల్లరంగుని మనం పూజించెదము. అందరు పనిచేయాలని, పనిచేయకుండా భుజించుట పాపమని గుర్తించెస్థితి వచ్చినది. వినోబాజీ "హజారిబాఘ్"లో నుండగా గో రక్షణకై వుపవాసముచేయుచున్న "శ్రీరామచంద్రశర్మవీర్" ని కలసిరి. వినోబాజీ తెల్పినప్రకారము. వీరు తమవుపన్యాసాన్ని విరమించిరి. 'హజారీబాఘ్' జిల్లాలో 7,01,497,75 ఎకరముల భూమి 5091 దాతలనుండి లభించెను. గయపట్టణములో భూదానసహాయకసమితివారు వినోబాజీని కలిపిరి. ఇది కొందరు జమీందారులతో ఏర్పరచబడివుండెను. వారు వినోబాజీతో బీహారు కోటా అయిన 32 లక్షల ఎకరములు సేకరించుటకు తెల్పిరి. వినోబాజీ పాట్నాజిల్లాలో పర్యటించుచున్నప్పుడు కుంభవృష్టివర్షములు కురియుచుండెను. అయినప్పటికి తమ పదయాత్రను నిలుపలేదు. వర్ష బిందువులు భగవంతుని క్షేమపూర్వక ఆశీర్వాదములంటూ అతి వుత్సాహంతో యాత్ర జరిపించిరి 'కైజోరి' గ్రామంలో వుపన్యసించుచూ, సోదరప్రేమను గురించి తెల్పుచూ, ప్రస్తుతసమయం మిత్రులమధ్యనుండే సమానతను కోరుచున్నదని, నేటికాలాని కనుగుణంగా సమాజాన్ని నిర్మించుకోవలెనని, పూర్వకాలనియమాలెంతవున్నతమైనవైనప్పటికి, మూఢవిశ్వాసంతో వానిని అదేవిధంగా యీరోజు అనుసరించలేమని, వానిని కాలానుగుణంగా పరిదిద్దుకోవలెనని అన్నారు. 18, 19 వ తేదీలు వినోబాజీ బీహారులోని 'థియోఘర్' గ్రామంలో గడిపిరి. 18 వ తేది సాయంకాలము వైద్యనాథదేవాలయమునకు చెందిన పండా, బాబాజీని దేవాలయదర్శనమునకు ఆహ్వానించిరి. హరిజనులకుగూడ దేవాలయప్రవేశ మంగీకరించినచో

తాము రాగలమని వినోబాజీ తెల్పగా, పండా అంగీకరించిరి. 19–వ తేది సాయంకాలము వినోబాజీ కొందరు హారిజనులతోను, తమ సహచరుల తోను దేవాలయమునకు వెళ్ళిరి. దేవాలయమును సమీపించగనే, కొందరు పండాలు "ధర్మానికి జై, అధర్మానికి నాశనం" అని నినాదాలుచేసికుంటూ లాటీలతో వినోబాజీపై పడిరి. వినోబాజీకి చెవివద్ద స్వల్పంగా గాయము లు తగిలెను. వారి సహచరులలో కొందరు తీవ్రంగా గాయపడిరి. శాంత మూర్తియైన వినోబాజీ తిరిగివచ్చిరి. మరుసటిదినము పత్రికాప్రకటనయిస్తూ అజ్ఞానమువలననే పండా లావిధంగా ప్రవర్తించినారని, యిందుకు వారిని శిక్షించవలసిన అవసరంలేదని, తమ సహచరులెల్లరు యీ సందర్భమున వుద్రేక మొందక, శాంతముతో ప్రవర్తించినందులకు తమకు సంతోషము కలిగినదని, ఈవిధమైనస్థలాలను ప్రభుత్వమె నిర్వహించుట వుచితమని, యిది తమ సూచనమాత్రమేనని అనినారు. ఈ సంఘటన పరిణామంగా, దేవాల యంలో హారిజనప్రవేశవిషయంలో ప్రజలకు తీవ్రచింతన చేసి, దీర్ఘంగా ఆలో చించే ప్రవృత్తినిచ్చినది. బీహారులోని 'దర్భంగా' మహారాజు వినోబాజీనికలసి 1,18,800 ఎకరముల భూమి దానమిచ్చెను. ఇతరులకుకూడ దానమిచ్చుటకు నచ్చచెప్పగలమని వాగ్దానముజేసిరి. భూదాన వుద్యమవ్యాప్తికి మూడు సూచనలును వినోబాజీ యిచ్చిరి. భూమిహీనులందరు ఐక్యతతోనుండి, భూమిగలవారి బెదిరింపులకు జంకకుండుట, భూమిహీనులు శుభ్రమైన, స్వచ్ఛమైన అలవాట్లను, నియమాలను అనుసరించుట, శాంతివిధానంలో భూమిగలవారికి న్యాయాన్ని నచ్చజెప్పుట అని తెల్పిరి. కార్యకర్తల సమావేశంలో వుపన్యశించుచూ, వినోబాజీ, కార్యకర్తలెవరు ఎవరిగురించి చెడుగా మాట్లాడరాదని, ఎవరియందైనా తప్పువున్న, వానికి ప్రేమతో నచ్చజెప్పప్రయత్నించాలని, ప్రతి వ్యక్తిలో ఏదోకొంత మంచివున్నదని, దానిని గుర్తించుటయె తన కర్తవ్యమని తలంచవలెనని హితవిచ్చిరి. మన వుద్యమంపైనను, దాతలోనున్న మంచితనముపైనను, పూర్తి విశ్వాసంలో కార్యకర్తలు వుద్యమాన్ని కొనసాగించాలని కోరిరి. దినమంతే భిక్ష మడుగుట కాదని, దినమన్న సమవిభాగమని, ప్రేమభావంతో, సోదర భావంతో దాతలకునచ్చచెప్పాలనికోరిరి. "పూర్ణియా"జిల్లాలో వినోబాజీ యాత్రలో 44,500 ఎకరముల భూదానం లభించినదని, 'పూర్ణియా' జిల్లాలో వుత్తరప్రదేశంలోని తాలూకాలలో లభించినంత దానంకూడా లభించలేదు.

కాని సమావేశాల్లో చాలమంది ప్రేక్షకులు హాజరవుతూ వుండేవారు. 7 డిసంబరున "సహార్ష" జిల్లాలో ప్రవేశించిరి. 21వ తేదీవరకు పర్యటించి "దర్భంగా" జిల్లాలో ప్రవేశించిరి. ఖాదీ పరిశ్రమకు ప్రసిద్ధిచెందిన, "హులస్‌పట్టి" గ్రామం చేరిరి. ఖాదీయొక్క ప్రాముఖ్యతను గురించి వుపన్యసించుచు, దానాల్లో అది గుప్తదానమని, దరిద్రనారాయణ సేవ కొరకు అందరు ఖాదీ ధరించవలెనని వినోబాజీ అన్నారు. "దర్భంగా" జిల్లాలలో కనీసం 3 లక్షల దానపత్రాలైనా సేకరింపబడాలని కోరిరి. 6 లక్షల కుటుంబాలు, 36 లక్షల జనాభా గల యీజిల్లాలో లెక్కచేసి, అదిన పత్రాలను వినోబాజీ కోరిరి.

1954 సం॥ జనవరి 10 వ తేదీన గంగా. గుండకన్ నదులను దాటి పాట్నాకు 8 గంటలకు చేరిరి. మూడురోజులు విరామములేని కార్యక్రమములో భూదాన వుద్యమవ్యాప్తిని గురించియు, శ్రమ, బుద్ధి, సంపత్తి శ్రమదానాలు గురించి ప్రచారం చేసిరి. 4 వ తేదీన బీహారు ప్రాంతములో జిల్లా భూదాన నిర్వాహకుల సమావేశం జరిగెను. 12వ తేదీన బీహారు ప్రదేశ కాంగ్రెసుకమిటీ సభలో వినోబాజీ ప్రసంగించిరి. స్త్రీలసభలో, విద్యార్థుల యువకుల సభలలోగూడా వినోబాజీ పాల్గొనిరి 15 దినము లు "పాట్నా" జిల్లాలో పర్యటించి, నాల్గవసారి జాతిపిత వర్ధంతి దినమైన జనవరి 30 వ తేదీన వినోబాజీ "గయ" జిల్లాలో ప్రవేశిస్తూ, బాపూజీ (Do or die) అనే ప్రవృత్తిని నేర్పించాలని అన్నారు. "గయ" జిల్లాలో భూదాన సేకరణ పూర్తికాకుండా, యీజిల్లాను విడువమని, చావో, బ్రతుకో తేల్చుకోవాలని అన్నారు. భారతదేశపు దృష్టంతా "గయ" జిల్లావైపు ప్రసరించినదని, కార్యకర్తల బాధ్యత, శ్రద్ధమీదనే వుద్యమ ఫలితం ఆధారపడివుందని అన్నారు. భూదాన వుద్యమంలో దేశంలో స్త్రీలుకూడా కార్యకర్తలుగా పనిచేయుచుండిరి. శ్రీమతి జానకీదేవి బజాజీ గాంధీజీ జన్మదినోత్సవ సందర్భమున 108 కూపదానాలు (బావులు) 80 తులాల బంగారము సేకరించి, వినోబాజీకి అర్పించిరి. స్త్రీ కార్యకర్తల కార్యసాధన తెలిపే గాథలనేకములు భూదాన వుద్యమ చరిత్రలో గలవు. వుదాహారణ బీహారులో ఒక గ్రామంలో నైతిక ప్రవర్తనలేని కఠిన హృదయముగల దుర్మార్గులైన జమీందారుండెను. అతని పేరన్న చుట్టుప్రక్కల గ్రామములో ప్రజలు భీతిల్లుచుండిరి. ఒకదినము ఒక స్త్రీ కార్యకర్త, వారి

భవనానికి వెళ్ళి, తలుపు తట్టగా, వారు నిద్రనుండి మేల్కొనివచ్చి తలుపు తెరచి, వారి రాకకు కారణమడిగి తెలిసికొనిరి. ఆమె జమిందారుని సోదరునిగా భావించుచున్నామని, సోదరి కార్యక్రమంలో సహాయము చేయవలెననియు కోరిరి జమీందారు జవాబు తెల్పుచూ, తాను దుర్మార్గుడనని, హృదయము లేనివాడనని, ధర్మభీతి లేనివాడనని పేరుపొందిన తమవద్ద నేవిధంగా రాగల్గినారని ప్రశ్నించెను. వినోబాజీ వుద్యమాన్ని గురించియు, వారి సందేశాన్ని గురించియు తెల్పి ఆమె వారిని మానసిక పరివర్తన పొందించి, 6వ భాగాన్ని దానంగా పొందగల్గెను. తరువాత, గ్రామం లోని వారినిగూడ గొనిపోయి, ప్రచారంజేసి, గ్రామంలో భూసేకరణ చేసెను. బీహారులో వినోబాజీ పేరు యింటింటా ప్రతిధ్వనించుచుండెను. భూదాన యజ్ఞపత్రిక 60 వేలవరకు గాంధీజీ జయంతిదినమున విక్రయింపబడెను. హిందీ కవులలో ప్రసిద్ధిచెందిన 'దుఖియాల్' భక్తులలో ప్రసిద్ధికెక్కిన మహారాష్ట్ర "సంత్ తుకడోజీ మహారాజు" కవిత్వము, భజనలు భూదాన వుద్యమాన్ని వుధృతము చేయుచుండెను.

ఏప్రిల్ 1951 సం॥న స్వల్పంగా ప్రారంభింపబడిన భూదాన వుద్యమం, యీ మూడు సంవత్సరములలో అత్యంతాభివృద్ధి పొందుచూ వచ్చెను. మొదటి సంవత్సరము వినోబాజీ ఒంటరిగానే వుద్యమాన్ని కొనసాగించవలసి వుండెను. సేవాపురి సమ్మేళనానంతరము అనేకమంది కార్యకర్తలిందు ప్రవేశించిరి వారిలో ముఖ్యులు శ్రీ జయప్రకాశ్ నారాయణ, శ్రీ శ్రీకృష్ణదాసు జాజు, శ్రీ వల్లభస్వామి. పండిట్ జవహర్ లాల్ నెహ్రూ, రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాద్, ఆచార్య కృపాలని మొదలగు ప్రముఖనాయకులు. ఈ వుద్యమ విశేషము గుర్తించగలిగిరి. ఈ వుద్యమ వ్యాప్తికి ప్రతి ప్రాంతమందు ఆయాభాషలలో వారపత్రికలు నడుపబడుచుండెను శ్రీ జయప్రకాశ నారాయణ చాల సమయము యీ వుద్యమానికి వుపయోగించుచుండిరి. పార్లమెంటు సభ్యులలో ముఖ్యులైన శ్రీ సుచేతా కృపాలని ఆచార్య అగర్వాల్ సేను గోవిందదాసు, మైథిలీ శరణగుప్త మొదలగువారితో ఒక కమిటీ ఏర్పాటు చేయబడెను. ప్రతి ప్రాంతములో సంచాలకులు పదయాత్రలు చేయుచుండిరి. ప్రజాసోషలిస్టు పార్టీ, జనసంఘ పార్టీలు కూడ యీ వుద్యమానికి సహాయపడు తీర్మానములుచేసి, ప్రచారము చేసిరి. వినోబాజీ తాము ఏపార్టీకి చెందనివారమని

యు, పార్టీలను గుర్తించమనియు, తమది ప్రజా కార్యమనియు, ఇది ప్రేమ, అహింసలపై ఆధారపడివున్నదనియు, స్వతంత్రజీవిగా కార్యక్రమం కొన సాగిస్తున్నామనియు, తెల్పుచుండిరి ఈ వుద్యమ వ్యాప్తి యీ మూడు సంవత్సరముల కాలములో విప్లవాత్మక రూపంలో ముందుకు సాగింది. ఫలితం స్పష్టంగావుండెను.

## సంపత్తిదానము.

భూదాన వుద్యమం దేశమంతా వ్యాపించుచుండెను. కాని యీ వుద్యమములో భూస్వాములకే అవకాశనుండెను. సంపత్తుగలవారికి అవకాశము లేకుండెను. భూమిలేకుండా సంపత్తివుండి, హృదయ పరివర్తన గలవారికి యిది ఒక చిక్కు ప్రశ్నగానుండెను పూజ్య వినోబాజీ ముందీ విషయముంచబడెను. వారు దీర్ఘముగా ఆలోచించి. చర్చించి సంపత్తిని కూడ సమభాగములో దానమిచ్చుటకు అంగీకరించిరి. సంపత్తిదానముకూడ యీ వుద్యమములో నొక భాగమయ్యెను. సంపత్తిదానము భూదానము కన్న అశేష వ్యాప్తిగల వుద్యమముగా రూపొందగలదని విశ్వశింప బడుచుండెను. భూదాన యజ్ఞమునకేమూల సిద్ధాంతములుండెనో, సంపత్తి దానమునకుకూడ అవే మూలసిద్ధాంతములుండెను. సంపత్తిమీదకూడ వ్యక్తికి యాజమాన్య ముండరాదని, సంఘానికే నుండవలెనని, అది సంఘ క్షేమమున నుపయోగింపబడవలెనని నిర్ణయింపబడెను. వ్యక్తి తన జీవితమున కవసరమైనంత వుంచుకొని, మిగిలినది సమాజమున కర్పించవలెను. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సమాజమునుండే లభ్యమవుచున్న యీసంపత్తిని సమాజ హితవుకొరకే వుపయోగించిన, అందు తన హితువుకూడ మిళితమై వుండగలదని తెలుపబడెను.

దాత తన ఆదాయములో ఒక భాగమునుగాని. లేక ఖర్చులో ఒకభాగమునుగాని దాన మివ్వవలసివుండును. ఆభాగము దాతయొక్క ఆదాయపు పరిమాణమునుబట్టి వుండగలదు. దరిద్రనారాయణుని తన పరివారములో నొకనిగా గుర్తించి, భాగమివ్వవలయును. ఆదాయమనగా ఇన్‌కంటాక్సు మొదలగు అనివార్యమైన ఖర్చులుపోగా. మిగిలిన నికరమైన ఆదాయము. దాత బుద్ధిపూర్వకముగా, హృదయపూర్వకముగా తనకున్న దానిలో భాగమివ్వవలయును. సంపత్తిదానములో యిది ప్రథమమెట్టు.

సంపత్తి సమాజపడు లవుట దాని చివరి మెట్టు. సమాజంపైపునుండి తాను సంపత్తికి ధర్మకర్తగా వ్యవహరించుటకు వ్యక్తి సిద్ధమనవలెను.

దానమిచ్చిన ద్రవ్యవినియోగం:— (1) భూదానయజ్ఞములో భూమి హీనులకు లభించిన భూమిని సాగుచేయుట కవసరమగు సాధన సంపత్తి నిమిత్తము.

(2) భూదాన వుద్యమములో పాల్గొను కార్యకర్తలకు, గ్రామసేవకులకు వారి నిర్వాహ వ్యయముల నిమిత్తము.

(3) సర్వోదయ సాహిత్య ప్రచారమునకు,

(4) భావికాలములో వినోబాజీకాని, సర్వసేవాసంఘముగాని, యీ వుద్యమములో యితర కార్యక్రమములు ప్రవేశపెట్టిన, దాని వ్యయమునకు, దీని వుపయోగించవచ్చును.

దానమిచ్చిన ద్రవ్యమునుండి మూడవభాగమును దాత తన యిష్టానుసారము సార్వజనిక కార్యములకు వినియోగించవచ్చును. రైతు తన సంపత్తిదానమును ధాన్యరూపములో నివ్వవచ్చును. సంవత్సరమునకు 25 రూపాయిలిచ్చు సంపత్తిదానము నీక్రిందివిధముగా వినియోగించవలెను.

(1) ఖద్దరు ధారణకు ప్రతి 50 రూపాయల ఖరీదులో సగం సంపత్తి దానంగా పరిగణించబడును.

(2) గ్రామ పరిశ్రమలద్వారా తయారయిన నూనె, బియ్యము, పంచదార, చెప్పులు, ఆవునెయ్యి మొదలగు వస్తువులను ఖరీదుచేసిన, మొత్తంలో నాల్గవభాగం సంపత్తిదానములో చేరగలదు.

(3) చేతితో విసరిన గోధుమ పిండినుపయోగించిన, శేరుకి 1 అణా చొప్పున, ఎన్ని శేర్లు అయినా, దాని కూలి ఖర్చులు సంపత్తిదానములో చేరగలవు.

(4) సర్వోదయము లేక భూదాన పత్రికలలో ఒకదానికి చందా, సర్వోదయ స్వాధ్యాయ విధానమునకు చందా యిందు చేరగలవు.

(5) సంవత్సరమునకు 12 రూపాయిలు సంపత్తిదానమిచ్చు దాతలు తమ యిష్టానుసారము లేక తమవంటి దాతలతో కలసి సార్వజనిక కార్యముల కుపయోగించవచ్చును.

ఆదాయములో దానమివ్వవలసిన భాగము:— నెలకు 50 రూపాయిలు ఆదాయంగలవారు రూపాయికి ఒకపైస చొప్పున, అనగా 64వ

భాగము దానమివ్వవలయును. నెలకు 50 రూపాయిలు మొదలు 150 రూపాయిలవరకు ఆదాయముగలవారు రూపాయికి రెండుపైసల చొప్పున అనగా 32వ భాగము యివ్వవలయును. నెలకు 150 రూపాయలనుండి 250 రూపాయలవరకు ఆదాయంగలవారు రూపాయికి మూడుపైసలు చొప్పున అనగా 21వ భాగం యివ్వవలయును. ఈ విధముగా ఆదాయములో అధికమైన ప్రతి వందరూపాయిలకు రూపాయిలో ఒకపైసా అధికంగా దానమివ్వవలయును. ఈ విధముగనే అడుగడుగు వేసుకుంటూ, చిట్ట చివరకు ఆదాయములో ఆరవభాగమును దానమివ్వవలయును.

# జీవనదానము.

భూదాన, సంపత్తిదానములతోపాటు, యీ యజ్ఞములో అనేక యితరదానము లుత్పత్తి అవుచూ, సర్వవ్యాప్తి నొందసాగెను. మానవుడైన ప్రతివాడు దానమివ్వగల శక్తిగల్గివున్నాడని విశదపరుపబడెను. సర్వోత్కృష్టమైన, విస్తృతమైన యీ యజ్ఞ సాఫల్యతకు జీవితము నర్పించవలసిన ఆవశ్యకత క్రమక్రమంగా గుర్తింపబడెను. దీనినుండియె "జీవనదాన" మను శాఖ భూదానయజ్ఞములో వుత్పన్నమాయెను.

1954 సం॥ ఏప్రెల్ మాసములో, బుద్ధగయలో సర్వోదయ సమ్మేళనము జరిగెను. చరిత్ర ప్రసిద్ధి నొందదగిన, యీ సమ్మేళనమునకు దేశము నలుమూలలనుండి భూదాన కార్యకర్తలు సమావేశమై వుద్యమ వ్యాప్తిగురించి చర్చించిరి. ప్రధానామాత్యులు, కాంగ్రెసు అధ్యక్షులు అయిన శ్రీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాదు యీ సమావేశమునకు హాజరైరి. ఒకదినము సమావేశములో, బీహారు భూదాన సేకరణ గురించి చర్చించు సమయమున, తమ కోటాను పూర్తి చేయలేకపోయినామనే విచారముతో ప్రజా సోషలిస్టు నాయకులు, బీహారు భూదాన వుద్యమములో ముఖ్యులైన శ్రీ జయప్రకాష్ నారాయణ రుద్ధకంఠముతో, ఆవేదనతో పూజ్య వినోబాజీని సరిగా వుపయోగించుకొనలేక పోయితిమని, దీనికి కార్యకర్తలే కారకులని, రాజకీయ భేదాలుకూడ దీనికి అవకాశ మిచ్చినవని, కనుక కార్యకర్తలు సర్వస్వము సమర్పణచేసిన గాని, వుద్యమము వ్యాప్తి చెందజాలదని, కావున తన జీవితమంతే. యీ వుద్యమమునకు సమర్పించుచున్నామని నుడివిరి.

సభలోని కార్యకర్తల నేత్రములనుండి భాష్పములు రాలెను. దీనితో జీవనదానము వుత్పత్తి అయ్యెను. తదుపరి వందల కొలది కార్యకర్తలు జీవనదాతలుగా ఆత్మసమర్పణ మొనర్చిరి. పూజ్య వినోబాజీకూడ, వుద్యమ నిర్మాణకు శైసప్పటికి, జీవనదాన మొసగిరి. సర్వోదయ కార్యకర్తలలో ప్రముఖులనేకుల జీవనదాతలుగా ఆత్మార్పణ మొనర్చిరి.

ఒక సత్కార్యము కొరకు జీవనదానమొనర్చుట నూతనవిషయము కాదు కాని ఒక విశేష కార్యసాధనకై తన జీవితము నర్పించుకొనుటయే జీవనదానము రాజకీయములు మొదలగు యితర కార్యములనుండి విముక్తులై భూదాన ఆందోళనమునకు తమ సర్వస్వమును సమర్పించవలెను. భూదాన వుద్యమమంత వుత్కృష్టమైనది, వ్యాపకమైనది, అవశ్యకమైనది మరొక కార్యము లేదని గుర్తించగలవారే జీవనదానము చేయగలరు. పూజ్య వినోబాజీ "జీవనదానము" గురించి వివరించుచూ, జీవనదాతలకు లభించు లాభము లేవనగా: మొదటిది ప్రజలనుండి అవహేళన, రెండవది నిరంతర పర్యటన అని తెల్పిరి ఈ రెండు నిర్వహించిననాడు వారికి గౌరవము లభించగల దని తెల్పిరి. "ఒంటరిగనే కార్యము నిర్వహించుటకు సంసిద్ధులుగ నుండవలెను. ఇతరుల సుఖదుఃఖములలో భాగమును పంచుకొనుచు, పవిత్ర, వుదార హృదయముతో కర్తవ్యమును నిర్వహించవలెను. కామక్రోధముల నుండి విముక్తిపొంది, జీవితమును పరిశుద్ధ మొనర్చుకొనవలెను. దేశమునకుపయుక్తమైన కార్యములను నిర్వహించవలసిన మనజీవితములు పరిశుద్ధముగ నుండనియెడల జీవనదానములో అర్థముండజాలదు. ఈవిషయములో ముఖ్యముగ మనమవలంబించవలసినది మనస్సుపై అంకుశముంచుకొనుట ఇంద్రియ నిగ్రహముగలిగి, విషయకాంక్షలనుండి విముక్తి పొందవలెను, నిరంతరము పనిచేయుచునే వుండవలెను. రామరాజ్యనిర్మాణమునకు కృషిసల్పవలెను.

జీవనదానములో భీతినొందవలసిన విషయమేమిలేదు. కొందరు హృదయశుద్ధిలేనిదే జీవనదానము చేయరాదని తలంచుచుందురు. హృదయశుద్ధి అనునది ఒక్కదినము జరుగునది కాదు. అది నిరంతరము జరుగవలయును. జీవనశుద్ధికి మనము ప్రయత్నమే చేయజాలకపోయిన, జీవనదానము నిరుపయోగము కాగలదు. జీవనదానమనునది ఏవ్యక్తి నిమిత్తము చేయునది కాదు. పరమేశ్వరుని సేవకై. ఒక మహత్తర కార్య నిర్వహణకై జీవితము నర్పించుకొనుటయె జీవనదానము. తమ కర్తవ్య నిర్వహణలో ఎన్ని

ఆటంకములు, కష్టములు సంభవించినప్పటికి స్థిరసంకల్పముతో శాంత, గంభీర హృదయముతో ముందుకు పోవలయును. ఇతరులు వ్యతిరేకించు చున్నప్పటికి, ఒంటరిగనే కార్యనిర్వహణ చేయవలసివచ్చినను, ధైర్యముతో నిర్భయముగ తన కార్యమును నిర్వహించుశక్తి గలిగి వుండవలెను. జీవన దాన మొసగ్గినవారి జీవితములు యోగయుక్తముగ నుండవలెను. జీవితము ను సమత్వముగా, నియమబద్ధముగా నుంచుకొనవలెను. జీవన దానమిచ్చు వారు తమ జీవితనిర్వహణకు యితరులపై ఆధారపడివుండరాదు. సదా చిరునవ్వుతో, వుల్లాసముతో యితరులతో కలిసి మెలసి మెలగుచూ, ఆత్మ శుద్ధితో సత్యమైన, వుత్కృష్టమైన కార్యమును నిర్వహించుటయే జీవన దాత కర్తవ్యమై వున్నది.

—: నమస్తే :—



చిత్తూరు శ్రీ వేంకటేశ్వర ముద్రాక్షరశాలయందు ముద్రితము.

# గ్రామదానము.

---

భూదానవుద్యమము వ్యాప్తినొందినకొలది, వుద్యమరూపము పలు విధములుగా విజృంభించెను. ఉత్తరప్రదేశ్‌లో వినోబాజీ పర్యటించునపుడు బీహారులో పర్యటించునపుడు కొన్నిగ్రామములు గ్రామదానములుగా యివ్వబడెను. గ్రామదానము యన్నపుడు గ్రామములో భూమికి యజమాని యెవరు యుండరు. గ్రామములోని భూమియున్నవారందరు తమభూమియంతయు దానముగా నిచ్చెదరు. భూమియంతయు గ్రామానిదే. గ్రామదానవ్యాప్తి యెక్కువగా ఒరిస్సాప్రాంతములో జరిగెను. ఒక కోరాపుట్టిజిల్లాలోనే 700 గ్రామములవరకు దానముజరిగెను. ఒరిస్సాప్రాంతములో 850 గ్రామములు దానముగా యివ్వబడెను. కోరాపుట్టిజిల్లాలో దొరికిన గ్రామదానములవలన భూదానవుద్యమరూపములో క్రొత్తదనమొచ్చెను. సర్వసేవా సంఘమువారు దొరికిన గ్రామములలో, ఆదర్శప్రాయమైన. గ్రామస్వయం పోషకత్వజీవితము నడిపించుటకు పూనుకొనినారు. ప్రతిగ్రామములో తిండి లేనివారు, గుడ్డలేనివారు యుండకూడదు. పరిశ్రమలమీద ఆధారపడిన నూతనవిద్యావిధానముతో యందరికి విద్యలభించునట్లు చూచెదరు. నిరుద్యోగసమస్య యుండకుండ చూచెదరు. ఆరోగ్యము, పరిశుభ్రత, వైద్య సహాయము, వ్యవసాయ అధికోత్పత్తి, గ్రామపరిశ్రమలు, వీటిని అమలుపరచుటకు కార్యకర్తల సహాయముతో పనిచేయుటకు సర్వసేవాసంఘ కార్యదర్శి అన్నాసాహెబ్ సహస్రబుద్దిగారు యక్కడనే వుంటున్నారు. ఉద్యమానికి అదర్శపుదారి, గ్రామరాజ్యమునకు సందేహమిచ్చే పునాది గ్రామదానమే. ఈ గ్రామములను చూచుటకు, కార్యకర్తలుగా పనిచేయుటకు దేశములోని అన్నిప్రాంతములవారును, సర్వోదయమునందు నమ్మకముగల విదేశీయులును వచ్చుచున్నారు.

గ్రామములో భూమి లేనివారుండకూడదు.

భూమియంతా గ్రామానిదే.

గ్రామములో భూయజమానులుండకూడదు.

సమాప్తి.

---

